# కృతిసమర్పణము.

చంపకమాల.

అజుఁడన బుద్ధిఁ బెద్దతన
మంబున సార్థక నామధేయుఁడై
త్యజన మొనర్చి దేహమును,
దాన దయాంచిత గంగిరెడ్ల వం
శజుఁ డగు బ్రహ్మయాఖ్యునకు
జన్మమె లేనటు సాఁకునీకె భ
క్తి జనిత మోద హేతువునఁ
గేలు మొగిడ్చి యొసంగుదున్ హరీ!

## సూచన.

ఈనాటకమును నాయొక్క వ్రాతపూర్వకానుజ్ఞ లేనిదే యింత నుండి యింతయో యంతయో యెవ్వరును బ్రదర్శింప గాదు. ఇది మొదలీసూచన నుల్లంఘించువారు రు 500/-ల నష్టశిక్షలకుఁ బాత్రులు కాఁగలరు. ఇందలి పాటల పోలికలను, గథాసంవిధానమును, భావములను బద్యగద్యరచనలను ననుకరించుట సర్వస్వామ్యత్వమును నతిక్రమించుటగానే యెఱుఁగునది. ప్రదర్శించు తలఁపు కలవారు నాకు వ్రాసిన వలయు విధానము నెఱుఁగుదురు.

పైవిలాసము—

పామర్తి బుచ్చిరాజు,
గోదావరిజిల్లా, కాకినాడ.

# ఉపోద్ఘాతము.

మనీషులారా !

నే నీ రూపకమును గాళయుక్తి సంవత్సర వైశాఖ బహుళ పాడ్యమీ ఆదివారమునఁ (26-5-1918) బ్రారంభించి, కాళయుక్తి సంవత్సర జ్యేష్ఠశుద్ధ తదియ మంగళవారమునఁ (11-6-24) బూర్తిగావించితిని. ఇది పెక్కుచోట్లులఁ బలుతడవులు పెక్కండ్రి మనుల కెక్కునటులు ప్రదర్శింపఁ బడినది. ఎందఱోదఱో నను దీనియొక్క ప్రతులకై నిక్కచ్చి చేసియున్నారు. కావున దీని సరిచూచుకొనకయ ముద్రింపఁ గారణ మైనది. నా శ్రీజగన్మోహనసమాజమువారు దీనిఁ బ్రదర్శించునపుడు మాత్రము హాస్యపాత్రల నభివృద్ధిచేయుచు లోకదుర్న్యయములను సహజముగ వెలువడింపుచున్నారు.

ఇది నేటివఱకు నెవరును వ్రాసియుండలేదు. కాని పలుమాఱు దీనిఁ దిలకించిన అసహాన ధురంధరులనుండి నాటకకోలాహలము దురాశాపాత్రులనుండి ప్రతులు వెలువడి సిద్ధమగుచున్న వని కని విని యున్నాను. వారి వ్రాత లెటులున్నను సమాయికులు వంచన మొందుదు రేమో యని సందేహింపుచున్నాను. మంచి చెడ్డలు మనీషులకే కేల్మోడ్చి విడిచితి.

ఇట్లు,

బుధవిధేయుఁడు,

పామర్తి బుచ్చిరాజు.

# ఇందు వచ్చు పాత్రల నామములు



పురుషులు:—

1. అదృష్టవంతుఁడు:—ఒక నిర్భాగ్య యోగ్యుఁడు.
2. దురదృష్టవంతుఁడు:—అదృష్టవంతునిఅన్న. భాగ్యుఁడు.
3. మైరావణుఁడు:—దొంగలనాయకుఁడు.
4. మారీచుఁడు:—దొంగలలో నొకఁడు
5. దీర్ఘజిహ్వుఁడు:— ,,
6. రక్తాస్యుఁడు:— ,,
7. కరాళదంష్ట్రుఁడు:— ,,
8. వినయంధరుఁడు:—కుట్టుపనివాఁడు.
9. గుణవంతుఁడు:—అదృష్టవంతుని తనయుఁడు.

స్త్రీలు:—

1. సుమతి:—అదృష్టవంతుని భార్య.
2. కుమతి:—దురదృష్టవంతుని భార్య.
3. గుణవతి:—దురదృష్టవంతుని బానిస కూఁతురు.

శాస్త్రి, శిష్యుఁడు, బిచ్చగాండ్రు, చచ్చుడి, వర్తకుఁడుమున్నగు పాత్రలన్నియు దొంగల మాఱువేసములు గా నెఱుంగునది.





శ్రీ

సంగీత

# అదృష్టవిజయనాటకము.



## నాంది—ప్రస్తావన.

---

ఉ. శ్రీలు తొలంగినన్ గపటశీలురు చేటుల ముంచినన్ ధృశా
ఫలమహాగుహాళి నటవీస్థలిఁ ద్రిమ్మర నైన నిమ్ముగన్
దేలు నదృష్టమేవ జయతీ యను నానుడి వేని నుండి యా
మేలిగుణుండు సభ్యులకు మించుప్రమోద మొసంగుఁ గావుతన్.

[నాంద్యనంతరము సూత్రధారుఁ డంజలి ఘటించి.]

ఉ. ముద్దులుమూట గట్టెడి ప్రపూతచరిత్రము శ్రావ్యగానమే
తద్దయు రంజకం బన సుధారసధార విచిత్రపద్ధతిన్
మద్దెలనేర్పు నేర్పరచుమట్టులఁ గ్రొగ్గిన నూత్ననాటకం
బద్దిర ! సర్వలోకవినుతాస్పద మంటకు సంశయం బొకో!

కావుననే నే నీయవనయామినీవినోదకథావిషయ మవశ్యము దృశ్య ప్రబంధముగ రచింపఁ గారణం బని దిదృక్షువులకు నానోట వెలువడింపు చున్నాఁడు గ్రంథకర్త.

నటి:—(ప్రవేశించి)

హిందూస్థానీ బేహాగ్ రాగము:—ఆదితాళము.

ఏకథయది ? యేకతమున-నేకవి యది విరచించెను
నా కెఱుఁగం బఱపవే నాథ !

సూత్రో:—అరేబియన్ నైట్సనం బఱంగెడి
యవనయామినీకథలలోని దే
ఆలీబాబా అండ్ ఫార్టీరాబర్సనే
అదృష్టవిజయనామనవనాటకంబే
ఇదివఱ కిది మనయాంధ్రభాష
దృశ్యప్రబంధముగ వెలువడ లేదే
హృదయరంజకం బగుదానికొఱంత
నిపుడు తీర్చె పామర్త్యన్వయాబ్ధి
శీతకరుఁడు నీతివంతుఁడు
పూతచరితుఁడు బుచ్చిరాజు!

నటి:—ఓహో! అతఁడా! సతతము శ్రీపతిసన్నుతుఁడు జగన్నుతుఁడ
ఇఁక జాల మేల ?

సూత్రి:—వల దదె యదృష్టవంతుఁ డడలి-వచ్చుచుండె.

నటి:—కర్తవ్యము

సూత్రి:—కావింపుదము. (వేరు వేరు వైపులకు పోవుదురు.)

ఇది నాంది—ప్రస్తావన.





శ్రీ

సంగీత

# అదృష్టవిజయనాటకము.

ప్రథమాంకము:—ప్రథమరంగము.

[ప్రదేశము : అదృష్టవంతునిగృహము. ప్రవేశము : అదృష్టవంతుఁడు.]

(1.) అనుబంధము.

అక్కటా! జగమంతయు ధనమూలమున జరుగుచున్నది. గుణవంతుఁ డైనను ధనవంతుఁడు కాకున్నఁ గాసునకుఁ గొఱగాఁడు. అయ్యయ్యో! ధనహీను గుణహీనుఁగను గులహీనుఁగను గూడఁ బరిగణింపుచున్నారు. దేశమున కెట్టియిక్కట్టు పుట్టినది! ధనమూలమున నిఖిలకలుషములును మఱుఁగు వడుచున్నవి. ధనమూలమున నధర్మములు మొలకలెత్తి తలలెత్తుచున్నవి. జారచోరత్వములు మీఱుచున్నవి. రంకులు నిరాటంకముగను బొంకులు నిరంకుశముగను సాగుచున్నవి. చేవ లేకున్నను ధనమదాంధత్వము కావరము మీఱఁ గాఱులఱపించుచున్నది. కులసంప్రదాయములఁ దలఁప నీకున్నది. అచ్చికబుచ్చిక లాడువారిం గాక మతిమంతుల హితసంతతుల దరికిఁ జేరనీయకున్నది. ఆహా! నిన్ను నెన్న వశమా ధనమా!

మ. కనులన్ మూసెద వంగహీనజనముల్ కన్పింప కుండన్ గటా!
విన౯గా నీయవు దీననాదముల వ్యాప్తిన్ జేయునాపన్నులన్

మనమున్ జొన్పఁగ నీవు మంచిపనులం బాటించి నీవృద్ధియే
ధనమా! ప్రాకృతుఁ జేయునీదగుమహత్త్వంబున్ నుతింపం దగున్.

ఓలక్ష్మీ! స్వగౌరవమున కేమిబాము వచ్చునో యనియా వైకుంఠ దూరగులఁ జేయఁ జూచెదవు! ఆహా! నీగుణములు వారికి బాగుగాఁ బట్టించెదవు! ఎంతమోహా మెంతద్రోహము! సుపాదించి పెంపు చేయుతలంపున, లేనికారణమున, జారచోరత్వములకు దింపుచున్నావు.

అయ్యో! అన్నయ్యయు నన్ను సరిగ నరయ కుండుటకు నీదౌర్భాగ్యము కదా కారణము! దౌర్భాగ్యమా! యోగ్యు నయోగ్యునిగఁ బరిగణింపఁ జేయునీ వెంతకుఁ జాలవు! హా!

సీ. జననీజనకులకె సంప్రీతిఁ దొలఁగించి
యలఁత కలఁత పెంచి యలరె దీవు
అగ్రజానుజులకె యాగ్రహంబును గూర్చి
మాఱుతీరుఁ జేర్చి మసలె దీవు
అక్కచెల్లెండ్రకె యామోదమును ద్రుంచి
కైలాట మొనరించి క్రాలె దీవు
చుట్టపక్కములకె చూపోపమిని గూర్చి
యనురాగము వెలార్చి యమరె దీవు
తే. గీ. ఇరుగుఁబొరుగువారలకును నీసడఁ గలి
గించి పస డించి విష పెంచి కేరె దీవు
అకట! తలకొట్లమారివే యగుదు వీవు
పేదరికమా! నీవు గవయ వేదన కద!

కటకటా! యెంత తర్కించినను నీకు వశు లగువారివంతల కంత ముందునే! కడుపుకక్కుఱితికై సతీసుతులకై యెట్టినీచమున కైన నొడఁ బఱతువు.

తే. గీ. వ్రణము లేకయె బాధించువ్రణమ వీవు
ఘాత లేకయె వేధించుఘాత వీవు
రుజయు లేకయె సాధించు రుజవు నీవు
పేదరికమ! నీవు గవయు వేదన కద!

దౌర్భాగ్యమా! నీవు నన్నెక్కినను దొక్కినను రక్కినను మెక్కినను మెక్కింత నా మానాభిమానముల నాయాత్మగౌరవముల నాశాంతస్వభావము నాసచ్ఛీలప్రవర్తనము నెడఁబాయ; మాయామోహయతనూయాత్రకై జారచోరత్వముల కెడమీయఁ; గాయకష్టములు తలపోయు. ఆహా! అదృష్టవంతుఁ డనుటకు మాఱు నన్ను-నాయన్నకు మాఱు-నన్ను దురదృష్టవంతుఁ డన సార్థకాభిఖ్యుఁడ నౌదును గదా! (ఆలోచనానిమగ్నుఁ డగును)

[ప్రవేశము సుమతి విచారమున]

(2.) అనుబంధము

అక్కటా! నన్నుఁ గట్టుకొన్నకతమున మన్నాథున కెన్నిబన్నములు గలుగుచున్నవి. భార్యయదృష్టమును బట్టి కదా భర్త భాగ్యవంతుఁ డగు నని యార్యవర్యులపలుకులు! అయ్యో! సతి నగునాపూర్వపూజ లిట్లున్నను నాకన్నపిన్న లయిన నదృష్టశాలులు కావలదే! అయ్యయ్యో! మాపురాకృతమునఁ జే నున్నది వ్యయ మయ్యె: రానున్నది కఱవయ్యె.

కం. పతిభాగ్య మెట్లు లుండిన
సతిభాగ్యము మెట్టునింటఁ జక్కఁగ నున్నన్
వెత లేటికిఁ గల్గెడు నని
మతిమంతులు వెలువఱచెడిమాటలు మృష లే?

కావున నీదృశావస్థ కంతకు నేను నాసూనులే కారణము. తినువారి నోట సిరి యున్న భర్తలు పట్టినది బంగార మగు. అదిగో నాథుఁ

డేదియో విచారింపు చున్నాఁడు. చేరి విచారము దూరము కావింప యత్నింతు. మనోహరా! ఏమి మనోవిచారము?

అదృ—కాంతా! నిరంతరదురంతసంతాపాతిశయమున స్రుక్కించి వాక్కించుదారిద్ర్యభాగ్యము.

సుమ—కాంతా! కాలచక్రమునఁ దిరుగాడునరులకుఁ గలిమిలేములు నిలుకడలే? అట్టుడుగువారు కొట్టుకొనకు లేవక యుండరు. ధరణీచక్రమున మనుజులెల్ల రీసరణిఁ గాలచక్రగమనము ననుసరింపక తప్పదు. ఒకఁడు చెడినఁ గాని మఱియొకఁడు బాగుపడఁడు. ప్రకృతతత్వ మిదియ. దీనికై విలపింప నేల!

అదృ—నీపలుకులు నిజము. కాని

సీ. కల్యాణి! కల్యాణకార్యముల్ దూరము
వెడలంగఁ జేసిన పేదరికము
తోడివారలతోడఁ గూడి పొందుమురువు
వెడలంగఁ జేసిన పేదరికము
మోహనాకారమున్ మోమునందంబును
వెడలంగఁ జేసిన పేదరికము
సింహేంద్రమధ్య! నాచెలువారుధైర్యమున్
వెడలంగఁ జేసిన పేదరికము

తే. గీ. కాన డాసి గొడ్డలి వేసి కట్టియలను
గొట్టి పొట్టపోసికొనఁగఁ గూర్చి; యున్న
వీటనే తల వంపించుపేదరికము
చెప్ప రానివంతలపాలు సేయు డెట్లు!

సుమ—"శాంతమ్ భూషణమ్ పరమపురుష లక్షణమ్మ్" నిరి. ప్రాణేశ్వరా! ఓర్పు ఎప్పటికైన మోదముఁ గూర్పక పోదు. క్షమ. భరించినవారినే క్షమ భరించును. తమరేమి కష్టపడుట లేదా!

అయినను మాదురదృష్టకారణమున మీకష్టము సఫలీకృతము కాకుండె. మే మింతియ పెట్టి పుట్టితిమి. తక్కువనోములు నోఁచి యెక్కువకోరికలు కోరిన నెట్లు వచ్చు! ఎండఁ బడకుండ వేళ కాహారము సంపాదింప నరిగి మరిఁగి రా మనవి. మనమే యిట్లున్న మునపసిపాపలమారాము నుడుపుట మఱియు దుర్ఘటము. సత్వరము మనదుస్థితిఁ దొలఁగింప సర్వేశ్వరుఁ బ్రార్థించి యుచితకృత్యాలాలసుల మగుట సర్వశ్రేయము.

(ఇరువురు చేతులు జోడించి)

(3) అనుబంధము.



ప్రథమాంకము—ద్వితీయరంగము.

---

[ప్రదేశము: అడవి. ప్రవేశము: దీర్ఘజిహ్వుఁడు బాటసారి వేషమున]

(4) అనుబంధము.

[ప్రవేశము: రక్తాస్యుఁడు, వక్రనాసుఁడు.]

రక్తా—ఓరే! వక్రనాసా! అల్లు పయానసన్నాఆళ్లోనే వున్నాట్రా! మనం బేగీ యేగి మననాయకుడుగారికో మనవి యెనర్పాలి.

వక్ర—తెల్లారేటప్పటికి వూళ్లో కెల్లాలనుకుంటున్నాట్రా! మనల్నేం సెయ్యాలనుకున్నారో! మా తెలివిగలోల్లు! మనల్ని తప్పించుకుని పోవాలనే యిల్లాలోసన! ఆఁ-ఊఁ-

రక్తా—బంగారా లన్నీ మూటలగట్టా రాల్ల బాబులుసామ్ముల్లాగ మన పనేం టనుకున్నారో! ఓ సాడితల్లీ చిగ్గొయ్యా హేఁ—

వక్ర—మన మీచుట్టుపట్టుల వున్నట్టు లాల్లకి తెల్సునటాఁ! యేలా కోలాలు యెక్కసక్కాలు యెచ్చరికలు యెగిరింతలు! అడ్డా

పాడ్తా యెల్లా మనుకుంటున్నారు. కాని యియ్యన్నీ యెల్త
య్యెల్లమ్మగుడికి నెఱగరు.

రక్తా—అయ్యన్నీ మనతలుపులమ్మలోవలో తొరగా సేర్చాలి.

[దీర్ఘజిహ్వుఁడు దూరము నుండి వచ్చుచు మాఱుగొంతుకతో.]

ఎవరఁడోయి అయ్యా! కన్ను తెన్ను కనిపింపదు బాబూ! నేను గూడ వస్తాను మీతో కొంచె మాఁగండి నాయనలారా! మగ్గురం జట్టుగా పోదాం.

రక్తా—(మెల్లఁగా) ఆఁగరా! నక్కరనాసా! ఆఁడెవఁడో సూద్దాం
ఆఁడగ్గిర యింతో అంతో వుండకపోద్దీ? ఏంయీలేకుంటె ఆఁడి
కంత తొంద రెందుకు? నెమ్మదిగా యేయి అడుగు.

వక్రి—(మాఱుగొంతుకతో) యెవరవయ్యా! తొరగా రా మరి.

దీర్ఘ—(చేరుచు) వస్తున్నా, వస్తున్నా.

రక్తా—ఓరే! యిద్దరమద్దినా నొక్కి కిక్కుఱు మనకుండ నోటిలో
గుడ్డ కుక్కి గూబ లట్టుకొని రెండుకల్లలేసి నాలుగులేకి లిచ్చే
సేది లూటీచేసి యేంచేసేదిన్నీ కాసుకో.

వక్రి—నచ్చాడా! ఊఁ-ఊఁ-నడా న్నెట్టాలి సూడు సూడు.

దీర్ఘ—యీాల్లిద్దర్ని కన్నుల్లో మన్ను గొట్టి చెరొకతన్నుతో మన్నుమీఁ
దడఁ గొట్టి మూటల్తో దాఁటాలి (కన్నుల దుమ్ము చల్లును.)

రక్తా—ఒరే! మనకళ్లల్లోనే దుమ్ము గొట్టేసాఁడ్! యేసాక్
యేసాక్ గూబకు బెత్తేఁడు చూసి (కన్నులు నులుము కొనును)

వక్రి—నాసేతాఁలు మెఱుఁగుతా వున్నాయ్‌రా! నీవే గుచ్చుకో
యిచ్చుకో యెచ్చఁగా బత్తికర్చుకి (కన్నులు నులుము కొనుచు)

దీర్ఘ—ఇదేం టాఁడు రక్తాసుఁడు యీఁడు వక్రంనాసుఁడు
లాగున్నా రే! మొగా లగుపడవు సీకట్లో

రక్తా—దీర్గజిమ్మఁడులాగ మాట్లాడ్తా వున్నాఁ డేంటిరో!

దీర్ఘ—ఓరి సిన్నతమ్ముఁడూ! నీవే నటరా రత్నాసుఁడా!
వక్రి—(సంభ్రమమున) ఆరాడి తల్లీ చిగ్గొయ్యా! మనన్న య్యేరా!
దీర్ఘ—మాబాగా జరిగిందిరా మనలో మనకే. అద్తే అయింది కా
నొంటే మనం వింతచెలాగ్గా వుంటేనే చాలా మేలు.
రక్తా—సరే లే; నీయెల్లినపు సేంవయింది? యేం వన్నా యెక్కడన్నా
యేసీయెత్తుందా లేదా అది చెప్పు ముందు.
దీర్ఘ—ఆ! చూచొచ్చా అచ్చాకోపు మీామా టోటీ!
వక్రి—మేమూా మంచొడుపు కనిపెట్టి తొరగా యెల్లి మనోల్లతో
తిరిగి రాకపోతే దొరక రని గబగబా యెల్తావుంటేనే నీ వెంట
బడ్డావు. అంతా ముందు తెలుస్తది. దొరగారి దగ్గిరికి రా
తొరగా (అందఱు నిష్క్రమింతురు.)



ప్రథమాంకము:—తృతీయరంగము.



[ప్రదేశము: కాననాంతరము. ప్రవేశము: అదృష్టవంతుఁడు]

(5) అనుబంధము.

(అనంతరము భయసంభ్రమాశ్చర్యముల దిక్కులు విలోకింపుచు).

ఏ మిది? భూనభోంతరాళంబు యాదృచ్ఛికంబుగ దుమ్ము క్రిమ్మి నది! విన విన రోదసీకుహరసీమ జక్కి డెక్కలచప్పుడును విస్ఫుటమగు చున్నది. అవి యశ్వఖురపతనజాయానినాదము లేనా! ఆయాశ్వికు లెవ్వరై యుందురు! మృగయాఖేలనాసక్తు లేరో యీకాంతారముఁ జొచ్చు చున్నారా! ఈయున్నతవృక్షారోహణ మాచరించి నిరీక్షించి పరీక్షించినఁ గాని యీనాయాందోళనము సందియముం దీరదు. (అని గొడ్డలి యీారమునఁ బాఱవైచి వృక్షమెక్కి మఱుఁగుపడును)

[ప్రవేశము: మైరావణుఁ డాది యగు 40 చోరులు]

(6) అనుబంధము.

మైరా—శహబాష్! అనుచరులారా! శహబాష్! మీరంద ఱీబంగారునాణెములఁ గలసంచుల నొక్కొ రొక్కరుగఁ గొని రండు. నే నిదే మనధనాగారద్వారముం దెరచెద. "ఓతిలోత్తమా!" (అన లోయతలుపులు విడును)

చోరు—చిత్తము తెత్తుము. (అని వరుసమై రెండేసిఘంచులఁ గొని పోవఁ దలుపులు మూసికొనును. మఱికొంత సేపటికి చోరు లెల్లరు వెలికి రాఁ దలుపులు తిరుగ విచ్చి మూసికొనును)

మైరా—అనుజీవులారా! మీ రందఱు యథావిధి నుదయకాల్యకరణీయంబులం దీరిచికొని సారపదార్థవిం దారగించి హే—(అని నగుచు) లేని దేమి మనకు! పూఁటపూఁటకు విందే! మాఱు వేసములు వేసికొని తగుచోటుల వాటముగ నేహానికాని రాకుండఁ దేకువ వేఁహన గలిగి మెలఁగుచు దిరుగ మనసాంకేతిక స్థానమున గుమి గూడ వలయు.

సీ. బాటసారులరీతి మాటకారులభాతిఁ
బలుకుచుఁ బేటల కరుగ వలయుఁ
గాణఖాంజకృశమూఁకబధిరాదులఁ బోలి
ప్రోలుల గోలమైఁ గ్రాల వలయుఁ
బగటివేసములను వైచుచు నగరుల
యానుపానుల నేర్చి యులర వలయు
భజనపరులపోల్కిఁ బాటలు పాడుచు
సందుగొందుల నెల్ల జరుగ వలయు

తే. గీ. మందుమాత్రికుల నన్మోడిమాడ్కిఁ జెంచు
వారల విధమునను భాగవతులవలెను
సంతలను జావడుల నిఁక సత్రములను
దేవళంబుల రేవులఁ దిరుగ వలయు.

పోవుదము రండు. వెడియు సాయంకాల మిచ్చోఁ జేరుదము. (అని చోరు లరుగుదురు. కొంత సేపటికి అదృష్టవంతుఁడు ప్రవేశించి)

అదృ—మరలి రారు కదా యింతలో ! ఇంకను జంకు దొలఁగదు. సాయంకాలమునకుఁ గాని చేర రిచ్చోటు. అయ్యారే ! ధూళి రేఁగుట్లు బాగుగఁ బరీక్షించి యీరమునఁ బరశువు పాఱవైచి పాదపమున కెగయఁ బ్రాఁకి దాఁగి యుండుట నేఁటికి నా ప్రాణ హాని లేక మానినది. వారికంటఁ బడి యుంటినా యింతకు జము నింటికాఁ బై యుండనే! ఆరయ వారు చోరు లనుటకు సందియ మా! ఒకఁడా యిరువురా! నలుబది మంది. ఆబందిపోటుగాండ్రు ఆయుధహస్తులై త్వరితగతి బఱఁగుతుఱఁగములతోఁ దెచ్చిన మూట లేమై యుండును! ఆచోరనాయకుఁడీతి నేను నా చోటుఁ జేరి వానిమాటనే వెలువడింతు కవాటము వాటముగ విడియు నేమొ !

కం. మాటలపటిమనె కాదా
బోటులుఁ బోటులు వశ మయిపోవుట మఱి యీ
చాటుగుచోటను గలుఁగుక
వాటము మాత్రము విడియదె పలికించెనఁ గా

(అటు నిటు చూచుచు గుహ డాసి) "ఓ తిలోత్తమా!" యన (దలుపులు విచ్చును. అదృష్టవంతుఁడు లోపలకుఁ జొచ్చును. తలుపులు మూఁత వడును! తిరుగఁ దలుపులు దెఱచికొని అదృష్టవంతుఁడు వచ్చి)

ఆహా! యేమి యీయమూల్య పదార్థములు! సర్వము స్వర్ణమయము ! రంగారుబంగారునాణెములతో నిండి యుండినసంచుల నాఖరత్రియము మోయఁ గలిగినన్ని కొంపోయెద. (తెరపడును.)

ఇది ప్రథమాంకము.





శ్రీ

సంగీత

# అదృష్టవిజయనాటకము.

ద్వితీయాంకము:—ప్రథమరంగము.

[ప్రదేశము:—వీధి. ప్రవేశము, కుంటి, గ్రుడ్డి, రోగి, చెవిటి మున్నగుభిక్షుకులు]

బాబుగారు - బాబుగారు - అమ్మగారు - అమ్మగారు
నాయనగారు - నాయనగారు - తల్లిగోరు - తల్లిగోరు
యేతండ్రి - యేతండ్రి - యేతల్లి - యేతల్లి
కడుపుకరుగు - కడుపుకరుగు - కడుపుమంట - కడుపుమంట
బాబోయ్ - బాబోయ్ - నారాయణ - నారాయణ
అమ్మోయ్ - అమ్మోయ్ - రామరామ - రామరామ
కళ్ళులేవ్ - కళ్ళులేవ్ - కాళ్ళు లేవ్ - కాళ్ళు లేవ్
చేతుల్లేవ్ - చేతుల్లేవ్ - జెబ్బల్లేవ్ - జెబ్బల్లేవ్
నారాయణ - నారాయణ - నారాయణ - నారాయణ
రామరామ - రామరామ - రామరామ - రామరామ
చేయెత్తి - చేయెత్తి - ఒక్కడబ్బు - ఒకడబ్బు
దానాధర్మం - దానాధర్మం - చేసుకోండి - చేసుకోండి
రాదారీ - రాదారీ - మారాజులో - మారాజులో

మాదిక్కు - మాదిక్కు - సూడండో - సూడండో
పట్టేదుకూడు - పట్టేదుకూడు - పెట్టండయ్యో - పెట్టండయ్యో
పొట్టకాలీ - పొట్టకాలీ - పోతుం దండో - పోతుం దండో
దన్నాలండో - దన్నాలండో - దన్నాలండో - దన్నాలండో
అన్నిసెనండో - అన్నంవండో - అనుగ్గరించీ - అనుగ్గరించీ
పెట్టాలండో - పెట్టాలండో - పెట్టకపోతే - పెట్టకపోతే
మట్టవండో - మట్టవండో - మట్టవండో - మట్టవండో

[అంతట ఒక శాస్త్రియు శిష్యుడు ప్రవేశింతురు.]

శిష్యు—సాలీలం కమ్మాలంజలం—సాలీలం కమ్మాలంజలం—

శాస్త్రి—ఓరేవ్ ఒరేవ్ సాలీలం కమ్మాలంజల మేమిటిరో సలిలం కమలం జలం అని యేమువక వేదపఠన చేయు చున్నావు. (అని భిక్షుకులదిక్కు) ఓ రిక్కరేతే ముందిరా మీావల్ల కాదు-మీావల్ల కాదు-అదిగో ఆపైవీధికి ఆపెళ్ళివారివీధికి వెళ్ళండారి యేను యినా దొరుకు తుంది.

భిక్షు—సిత్తం బాబూ! యెట్టకున్నా యెట్టే యిల్లు సూపు మన్నారు. (చనెదరు)

శాస్త్రి—ఊఁ—శిష్యా! యేమిటీ నీకుఁ గావలసిన దేమిటి ' యేదీ! తిరుగా చదువరా చెప్పుతాను.

శిష్యు—మటి వినండి.

ఉ. అంతట వాయుపుత్రకుఁ డుగ్రాకృతి మీాఱఁగ వ్రాలు గోఁక బా
ధింతును వీరి నం చరుగుదెంచి గృహంబులఁ గాల్చుచుఁ గడున్
గంతుచుఁ బాలురక్కసుల గారియఁ బెట్టుచు వారియంతమున్
గాంతు నటంచు సత్వరముగాఁ గినుకన్ జనుదెంచె నెంతయున్

శాస్త్రి—ఆఁ-వహావ్వా! వహావ్వా! యేమిపని చేశావోయి! మటి ఆంజనేయుఁడేమి సామాన్యుఁడే! (అని రొండి నున్నపొట్లము

లోనిపాడుము పీల్చి గొంతు సవరించుకొంచు) ఏదీ మ ఱొక్క-
సారి కొంచెము కొంచెము చదువుము?

శిష్యు—అంతట వాయుపుత్రికుఁ డహంకృతి మీఱఁగ——

శాస్త్రి—ఆఁగరా వెధవా! అక్కడి కాఁపు ఘతి చెప్పుత్తిను. అంతట అనంతరము అటుపిమ్మట, వాయుపుత్రికుఁడు=ఆవాయువుపుత్రికుఁడు

శిష్యు—ఆమాటకుఁ దెలుఁగుఁ దెలుపండీ!

శాస్త్రి—ఓరి నీతెలుఁగు వెలుఁగ నీ కిదే తెగులు! తెలుఁగో అంటావు. నాకు సంస్కృతపరిచయా మధికము. వాయువుపుత్రికుఁడంటే మారుతి అనఁగా హనుమంతుఁడు: సమీరకుమారు వినలే దటరా?

శిష్యు—సరి సరి తెలిసిం దిప్పుడు మఱీ బాగా వినికి డయిందండి

శాస్త్రి—అహంకృతి మీఱఁగన్=అహంకారము అనఁగా క్రోధము అనఁగా కోపము, హెచ్చఁగా అధికము కాఁగా. చదువు?

శిష్యు—వెల్గుత్రోఁక బా—

శాస్త్రి—గూబలు మెలత వేసిన బా—(అని చెవి పట్టుకొనును)

శిష్యు—వదు లండీ గురువుగారు వదు లండీ!

శాస్త్రి—వదులైతే గట్టిగాఁ బట్టెద. దౌర్భాగ్యదామోదరా! ఆపై వాక్యమును గలిపి చదువు? (చెవి వదులును)

శిష్యు—బాధింతును పీరి నం చరుగుదెంచి

శాస్త్రి—అఁ- వెల్గుత్రోఁకన్=శిఖిశిఖాయమాన మైనలాంగూలముతో

శిష్యు—నాకు తెలియ లే దండీ!

శాస్త్రి—నీ కొకటి తెలి సేడిస్తేను ఇది తెలియడానికి; అనఁగా అగ్నిజ్వాలలు పఱపుచున్న వాలముతో బాధింతును=శ్రమపఱచెదను, కష్టపెట్టెదను; పీరి నంచు=పీరిని యావన్మంది ననుచూ;

అరుగుదెంచి=అక్కడ ఉన్నషువంటి తిన్నెలు అనఁగా వేదికలు సరే అరుగులే అందాం. అక్కడిఅరుగులు త్రెంచివేసినవాఁడై

శిష్యు—గురుప్రగారూ! వారిని శ్రమపఱచెద ననుకొని యరుగులు త్రెంచడ మేమి టండీ! ఇంకొకర్థ మే దైనా ఉందేమోనండీ!

శాస్త్రి—అరుగులు త్రెంచితే శ్రమ కా దషరా! ఎక్కడ కూర్చుంటారు నీనెత్తిమీఁద. నీమొగము వ్రేలెఁడు వెధవవు నాకన్న తెలుసునషరా!

శిష్యు—పోనీయండీ మీఅర్థమే ఖాయము కానీయండీ అరుగులు త్రెంపుట యేలాగండీ!

శాస్త్రి—అరుగులు త్రెవ్వేశాఁ డనడానికి అప్లాగ వేశాఁడు: మతిలేనివాఁడు యతికోసం వేశాడు మీఁద చదువు తెలుస్తుంది.

శిష్యు—గృహంబులఁ గాల్చుచున్ గడున్ గంతుచు—

శాస్త్రి—ఆఁ-ఆఁపు మప్లాగ. చూశావ్ వేశావ్ చెప్పదంటుప్రశ్న అరుగులు త్రెంచడ మేమి టండీ! యని? విను. గృహంబులఁ గాల్చుచున్= నివాసములను ఆవాసములను అగ్నిహోత్రున కర్పింపుచు అనఁగా పరశురామప్రీతి చేసివేశాఁడు! అరుగులు త్రెంచివేసి నివాసములు కాల్చి బూదిచేసి: చూచు క్రమము తప్పినాఁ డేమో! ముందుండును గావున ఆదిని వేదికలు త్రెంచి పిదప సదనమును దగులఁబెట్టినాఁ డన్నాఁడు. ఆహా! అలాగ స్వారస్యము గ్రహించాలి. మఱి ఊఁటకే అన్నారూ.

కం. కవితాకన్యరసజ్ఞత
కవికన్న రసజ్ఞుఁ డెఱుఁగుఁ గవి యేమెఱుఁగున్
ధవళాక్షిసురతసౌఖ్యము
ధవుఁ డెఱుఁగును గాని కన్నతం డ్రే మెఱుఁగున్.

అని. వ్యాఖ్యానకర్తలంటే మఱేమనుకొన్నావ్ పరమసరసులు; కడున్ గంతుచు=మిక్కిలి, ఎక్కువగా అనఁగా చాలా దుముకుచు

శిష్యు—బాఉురక్కసుల—

శాస్త్రి—బా ఱేమిషిరా! నీమొకబాఉ-బాఉ కుఱుచయున్నా. పాఉురక్కసులు అని యేడువుము.

శిష్యు—ఇసీ! ఇది మఱింతసహ్యాముగ నున్నదండీ! ధ్వనింగామన్నదండీ!

శాస్త్రి—నీకు ధ్వనిస్తూ వుంటవి చవటపీనుఁగా! చదువు ?

శిష్యు—పాఉురక్కసుల గారియఁబెట్టుచు వారియంతమున్

శాస్త్రి—ఊఁ చదువు ? మధ్య మానెద వేమిరా పశువా !

శిష్యు—అక్కడికే నండి పాదము.

శాస్త్రి—చూడరా ముందున్నది. చదువు ?

శిష్యు—గాంతు నటంచు సత్వరముగా

శాస్త్రి—పాఉురక్కసులన్=పరుగిడురాక్షసముండాకొడుకులను

శిష్యు—పాఉరక్కసు లంటే పరుగిడురాక్షసముండాకొడుకు లాండీ!

శాస్త్రి—మఱేమనుకొన్నావు? గారియఁబెట్టుచున్=బాధపెట్టుచూ; వారియంతమున్=వారిమరణమును; గాంతునటంచున్=ఈక్షించెద నంచు సత్వరముగా=శీఘ్రముగా.

శిష్యు—గురువుగారూ! మీరు తిట్టినఁ గొట్టిన సరే కానండి పద్యములోనిపదముల కన్న మీరు శెల విచ్చుపదములే కష్టముగా నున్న వండీ !

శాస్త్రి—నిరక్షరకుక్షివి. నీకు సంస్కృతజటిల మే మైనఁ దెలిసియుంటేనా! చదువు. ఊఁ—అక్కఱ లేదు లే ఆపై నేమిషి (సాలోచనముగ) కినుకన్ చనుదెంచె నంతయున్: కినుకన్=ఆగ్రహమున; చనుదెంచె నొంతయున్=అత్యంతము కుచములు త్రెంచినవాఁ డాయెను.

శిష్యు—అయ్యయ్యో ! అదేమి టండో !

శాస్త్రి—అ దేమి టేమిటి ? సప్తుఁ ల్లకుఁకా ! కుచములు త్రెంచి వేశాఁ డంటేను. మూడు పాలుసక్కసులు అని లేవు, కోఁతి వెనులకు కొదు వేమిషి? బ్రహ్మచారీ శతమర్కటః ! నీకన్న నా కుంకా ! నర్లుఁడేపు నీవే అవకతవకలు చేయుదువే అతఁడు చేయుట కేమి ! క్రోధ మనఁగా సామాన్యమా ! ఉచితానుచితములు తెలియునా ! అది పట్ట లేక అవి పట్టి త్రెంచివేసి కసి తీర్చుకొన్నాఁడు.

శిష్యు—పరు గిడు రాకుసు లన్నారు కా రండీ మీరు ?

శాస్త్రి—రక్కసి శబ్దమునకు బహువచనము రక్కసులే రాకుసి ముండాకొడుకు లన్నానా ముండలే ఓరి కోఁతివెధవా ఇదిరా నీసందేహము ! మగవాళ్లకూ ఉంటవి-కానీ-

శిష్యు—బాగానే ఉన్న దండీ ! పై పద్యము వినండి.

శా. పుత్రెంచెన్—

శాస్త్రి—ఆఁగు ! శార్దూలము కాఁబోలు. ఆ-నీశార్ధము నాశార్ధము పెట్టినట్టే యున్నది. వెధవ తెంచడములు పుత్రెంచెన్ అనియా ఆపువర్ణమున కర్థ మేమిటి ! పచ్చికపిత్థము గొంతుకఁ బడ్డట్టు ఈపచ్చికయిత్తము కొఱుకుపడుట లేదు (అనునంతఁ జచ్చుడి వాఁడు ప్రవేశించి)

చచ్చు—ఆమ్మా ! దొడ్డితలుపు తీయించం డమ్మా !

శాస్త్రి—ఓరి అఘుంటా శుంఠా ! నిన్ను తగులఁ బెట్టా !

చచ్చు—ఓసి మారీచుఁడుగారో !

శాస్త్రి —ఓరీ! నీవటరా! చూడుచూడు నీదొడ్డితోవ నీవు బాగుగాఁ జూడు రారా శిష్యా ! మనము మఱియొంకెడ కరుగుదము.

శిష్యు—“యశ్శజ్ఞాన దయాసిందూ గోడ దాఁటితే అదే సందూ'

(శాస్త్రి శిష్యుఁడు చనెదరు)

చచ్చు—నాకీ మల్లీ బేగీ యెల్లాలి తీయమ్మా దొడ్డితలుపు. ఒక్కంటి పనే సక్కపెడ్తే కడుపు గడవడం యెలా గమ్మా!

(లోపల) ఓరీ తీయు చున్నాము. నీ వెవఁడవురా కొత్తవాఁడవు నిలువఁ బడవు.

చచ్చు—నాకీ బదలాయించా రమ్మా! యిక్కడికీ నాపని బాగా వుంటది సూడండీ మఱీ! సుబ్బరంగా తుడిసేస్తా నమ్మా! (లోపల) నీ మొగము.

చచ్చు—ఆఁ-యేంటమ్మా! ఆలాగ సెప్తారు మల్లీ! నాకీ మీకీ తెలదు. తుడిచేసిం తరోత యెడ్తానో లేదో అకన్కండానే బద్ద ఆవకా య్బద్ద మీరే సూడండి (అని తలుపుతీయ లోని కరుగును.)



ద్వితీయాంకము:—ద్వితీయరంగము.



[ప్రదేశము: అదృష్టవంతునియిల్లు. ప్రవేశము: సుమతి విచారింపుచు]

(7) అనుబంధము.

హా! దైవమా! శ్రీరమామనోహరా! గోరుచుట్టుపై రోఁకటిపోటు నా నాదారిద్ర్యమునకుఁ దోడు ఏమికీడు మూడింతివి! నిరపరాధుల మగుమమ్ము గురుపరాభవమ్ముల ముంపఁ దలఁ పేల నీకుఁ గలిగె! మాపురాకృతమా!

(8) అనుబంధము.

ఆపన్నశరణ్యుం డగునాపన్నగశయనునిమీఁద నే భారమువైచిన సర్వము నిర్విఘ్నముగ నెరవేరు. ఇంతకాలము జాల మేల చేసెనో నాజీవితేశుఁడు తెలియమిఁ గడుఁగడు నలజడి వొడమెడిని. ఏమి యీ

వామాక్షీస్పందము! శుభము లే మేని చేకురునా! (ఆలోచింపుచు నుండును. ప్రవేశము అదృష్టవంతుఁడు)

అదృ—అవనిసమస్తము అంధకారబంధురమై యున్నది. అబ్బా! యింత పర్యంతము గుండెనిబ్బరము లేక యుండె.

తే. గీ. ఆక్కటా! యొక్కసారిగ నమితధనము
తా లభింప మై మఱవక తాళ వలయు
గుప్తముగ నుంచి కుదు రైనగుండెతోడ
మిగుల జాగరూకతతోడ మెలఁగ వలయు.

నేటికిఁ గదా నే నదృష్టవంతుఁ డనఁ బరఁగుదు! (నిరీక్షించి) ఏమి! నామానినీమణి నాకొఱకే కాఁబోలు నిరీక్షింపుచు నిలిచినది ద్వారమున! (ప్రకాశముగ) జీవితేశ్వరీ!

సుమ—మానధనా! నమస్కారము. ఇంతపర్యంతముఁ దమరు శ్రమ నొందుచు నె యుందురే కాంతా!

అదృ—"కష్టీ ఫలి" యన్నారు కాంతా! మనవంతలు నేఁటి కంత మొందినవి. నేఁటి కన్వర్థాభిఖ్యుఁడ నైతిని. వెలుపల నిలిచి పలుకుటకు వలనుగాదు. మనఖరముల సరగున జరుగ నిమ్ము గృహాంతరమ్మునకు.

సుమ—శ్రమపరిహార మాగారము చేరనికారణ మేమియో నేరకుంటి.

అదృ—ఇంధనములకుం దోఁచు మనకుం ధనము సులభముగ లభించినది. వేగిరము లోగిలిలోనికి నడువుము.

సుమ—మనోహరా! లేమికతమున నక్రమ మేమయిన నొనరింపరు కదా! ఇహపరములకు వెలి యగుతెరువు నరయరుకదా!

అదృ—తే. గీ. పడఁతి! యెంతనుమానముపాలుపడితి
వింతలో నింతకాలము చెంత రేయిఁ

బవలు వసియింపు చుండియుఁ బ్రాణనాథు
గుణమె కనిపెట్ట నైతివి గుణధురీణ !
నే నట్టికట్టెఁడితనమున కొడిఁ గట్టుదు ననియే తలపోసితి వే !

సుమ—క్షమింపుఁడు సహజచాపల్యమునఁ బలిపినదురుసుఁదనీము.

అదృ—కం. ఖరముల లోఁ గొనిపో సుఖ
కర మా ననుమానములును గట్టెకు నింకన్
బలుఁగును నెమ్మది నెమ్మది
తెరవా ! పై మాట లాడఁ దెలపి యగునుగా.

ఉ. సందియ మొంద కింక విలసచ్చరితుండు భవత్ప్రియుండు "మా
యం దనుజాధమాధమునియట్టులు జారనిరీతిఁ జోరు భా
తిం దయనుం ద్రొలంగుచు నతిక్రమణం బొనరించె మంచి, చె
డ్డం దలపోసి విత్త మొకటం గడియించుతెలంగె" యంచునున్.

జాగు బాగు కాదు పోవుదము. (అని ఖరములు లోపలికిఁదోలును)



ద్వితీయాంకము:—తృతీయరంగము.



[ప్రదేశము: వీధి. ప్రవేశము: అదృష్టవంతుఁడు, దురదృష్టవంతుఁడు]

దుర—

ఉ. తమ్ముఁడ! యొక్క చే నడుగుదున్ నిను దేవునిమీఁద నొట్టు స
త్యమ్ము వచింప వేని యెది? యట్టు లొనర్పఁగ నీకరమ్ము శీ
ఘ్రమ్ము మదీయహస్తమును గ్రమ్మఁగ వేయు మి దేల నీదుశీ
ర్షమ్మును వంచియుంచితివి ? సందియముం దగఁ బొందు చుంటివో.

అదృ—అగ్రజా ! నీ వడుగఁ గోరునది యెదియో నేరకయ తొలుతఁ
బలు కిచ్చు టెట్లు ?

దుర—దాన నీకుఁ బ్రాణహాని రాదు; గ్లాని లేదు; భోనము పోదు.
అభయ మ్మిడియెద నట్టిదానినే నే నడుగుచున్నను.

అదృ—(తనలో) ఇతనితలఁ పేమగు! నాభాగ్యోదయమోదంత
మెఱుంగఁ గాదు కదా! అయిదవచెవిఁ బడ కుండ భద్రముగ
లోఁతుగఁ బాతిపై వినమూజాంబూనదోదంతం బెట్లు తెలియు!

దుర—ఇంకను శంకయే?

ఉ. ఎంతయు సంశయించెద విఁ కెందుకు పొందుగఁ జెప్పకున్న రా
ద్ధాంతము తప్ప దంచు మదిఁ దల్పు మిఁ కంతటిత్రో నడంగునే
పంతము పట్టి నిన్ బరిభవంబున ముంచెద మించ నీకుపా
ణాంతము సౌను బాగుగ రయమ్ముఁ దలంపుము నెమ్మి నెమ్మదిన్.

అదృ—ఇంతకర్ణకఠోరముగ భాషింతు వేల యన్నా! నే నేమి నీతలఁ
పులు తెలుపు మంటినే కాని నిజమును దెలుప నంటినే!
భ్రాతా! నాసందేహమునకే శంకింపుచుంటివి కాని నీశంకను
దలఁపోయ కుంటివి.

శా. నిన్నే నీ వయొ! నమ్మఁ జాలమిని గ్లానిం బొందుచున్నావు నా
యన్నా! న న్నిఁక నెట్లు నమ్ముదువు మాయన్ బన్ను చున్నావు లే
కున్నన్ దిన్ననిమాటలం దెలుపకే యొట్లుల పెట్టంగ మున్
నన్నుం గోరుచు నుంటి వద్ది యనుమానస్వాంతునిం జేయదే?

కావున నా యీసంకోచమున కంతకు హేతువు నీప్రసంగవిధానము.
మఱియు నీవడుగునది పరమరహస్య మనియు నది గుట్టుపట్టి యుంచనగు
నది యనియు బలాత్కారమున నొట్టు పెట్టించినఁగాని దాని రాఁబట్టుట
దుర్ఘట మనియు నీక విశదమై యున్నట్టులు గట్టిగఁ బొడకట్టెడిని.

దుర—అవు నది పరులకు దుర్ఘటమైనను నొక్కకడుపునఁ బొడమి
యొక్కయెడను జరియించు చున్న సోదరులకుఁ బరమరహస్యము
లుండఁ దగునే!

అదృ—(తనలో) ఎన్నఁడు లేనిసౌభాగ్యము నేఁ డెంతగాఁ గలిగినది (ప్రకాశముగ) ఇంక నీశంక యేల ?

దుర—బ్రహ్మచర్యము నెడఁబాసి గృహస్థాశ్రమము స్వీకరించినభర్త మనము భార్యగుణానుసరణముగ మార్పు గను ననుసంశయము నను బాధించు.

అదృ—ఓఅన్నా ! అబలలతాపరీవృతముఁ నఁ గుజనులనైజము మాఱు నేమొ కాని ఘనతరులస్వభావము వేరు కాదు.

తే. గీ. భర్త యనునామముఁ బడసి భార్య యనెడి
యబలనద్గుణస్వీకార మాచరించు
కామినీలోలు మగఁ డనఁగాఁ దగు నొకొ !
తాళుమా అది యుగాదిశికారణమున.

దుర—ఆలోకముం బట్టి యాలోకించితి. ఇదిగో నేనడుగఁ దలఁచినది వినుచు చున్నాఁడ. చెప్ప నొప్పినఁ బ్రమాణముగ నిజము నే చెప్పుము.

అదృ—సోదరా ! అట్లే.

దుర—లెక్కింపఁ దరము కాని భద్రపతకములు నీ కెక్కడ నలవడినవి?

అదృ—బాగరునాణెములా ! నీ కెట్లు తెలిసె?

దుర—పిల్లి కన్నులు మూసికొని పాలఁ గ్రోలుచుఁ దన్నెరు నారయు లేరనుకొను నట్లుండెదఁ దమ్ముఁడా ! నీచరితము. అన్నియు నిట్టి వేనా ! ఏమట్లు వెలవెలఁబోయెదవు ! (అని యొక నాణెము చేత నుంచును)

అదృ—నాకడ నాణెము లున్నట్లు తెలియుటయే కాక యది నీ కెట్లు లభించెనా యని విస్మయకలితుఁడ నగు చుంటి.

దుర—దూరదృష్టియు నుచితాలోచనయు గభీరశాంతము గలుగమి లభించె.

అద్రు—ఆవిధానముం గొఱంత గోరంతయు లేని యట్లు వినిపింపనే యగ్రజా !

దుర—అవి లభించువిధానమునఁ గొరంత గోరంతయు లేనియట్లు వినుపింతువే యనుజా !

అద్రు—(తనలో) అతివిషమసంధి సంప్రాప్తించెనే ! (ప్రకాశముగ) ఊరివా రెల్లరు వినుటకన్నఁ బ్రాణహానిఁ గొనుటకన్న సోదరు నకునీకుఁ దెలుపుట కభ్యంతర మేమి ! మఱియు సంతాన హీనుఁడవై యున్ననీయొద్ద నాధనరాశి యిప్పు డున్న నెప్పటి కైన నాసూనునకుఁ దప్పక చేరుట సందియ మొందుకు! వినుతు.

దుర—మేలు ! మేలు ! బాగుగ నాలోచించితి విప్పటికి. కడచిన రేయియే కదా నీకివి దొరకినవి !

అద్రు—(తనలో) వీని కేమైనఁ బిశాచమంత్రోపాసన మున్నదే ! (ప్రకాశముగ) అవును.

దుర—గణోప వశము కాని వాని నీవు నీజాయయుఁ గుంచముతోఁ గొలువరే !

అద్రు—(తనలో) పూస గ్రుచ్చినట్లు వాక్రుచ్చు చున్నాఁడే !

తే. గీ. అయయొ ! యతిరహస్యము బట్టబయలు నాఁగ
నట్టిదియ కాదె మేదిని నెట్టి దైన
నెవ్వరికి నింత తెలియను చిహ్న గలుగ
దనుచుఁ దలఁచితి నింకపర్యంత మేను.

(ప్రకాశముగ) కొలుచుట వాస్తవము. అన్నా ! నీయొద్ద మంత్రబలము కలదే ?

దుర—మంత్రబలము లేదు కాని తంత్రబలము కలదు. ఎన్నఁడు నవస రము లేనికుంచమును నకాలవేళ వికసనవదనమున నీనారి నానారిఁ జేరి కోర దూరదృష్టి గలయామె పర్యాలోచించి

కుంచమునకు జిగు రంటించి మఱియుఁ జే నుంచె. అనంతరము మరలుచుతఱి దాన నీనాణెము కాన నయ్యె.

అదృ—(తనలో) ఔరా! వేల యగునామగనాలికతమున నీగోల సంభవించె. ఇప్పు డిది గడించినచొప్పు చెప్పక తప్పదు (ప్రకాశముగ) ఈశాన్యగిరిప్రాంతమునకు ని న్ననుపఁ జింతింతు.

దార—నాకు లేనివంత నీకా! విస్పష్టముగ వినుపుము. ఏయీశాన్యగిరికి?

అదృ—మన దగుజనపదమున కీశాన్యమున నున్నవనాంతరగిరికి. ఆగిరిగహ్వరము నరసి "ఓతిలోత్తమా!" యన్నచో నందలిద్వారము విచ్చును. లోపలకుఁ జొత్తువా కాంచెంకోశము నీసడించుధనరాశి కనఁబడును.

దార—ఏ మన వలయు! "ఓతిలోత్తమా!" అనియా?

అదృ—ఔను. ఆమాట మఱచితివా మరణమె. మఱియు నయ్యొవేళల నయ్యైశ్వర్యము వృద్ధిగావింపనో రక్షణాపరీక్షణవిషయముననో రాకపోకలు జరుపుబందిపోటుగాండ్రో నది నిండి యుండు. భద్రము.

దార—సరియే. (అని నిష్క్రమించును.)

అదృ—ఓదౌర్భాగ్యదేవతా! న న్నింకను నెడఁబాయ నిచ్చగింపవే! ఆశఁ గొల్పి పాల్పుగ వశము కా నున్న కోశరాశి నాశాంతరముననె యంతరింపఁ జేసిననీయావచ్ఛక్తి వర్ణనాతీతము. ఓపరమేశ్వరా!

(9) అనుబంధము.

తెరపడును.





(శ్రీ)

సంగీత

# అదృష్టవిజయనాటకము.

తృతీయాంకము:—ప్రథమరంగము.

[ప్రదేశము: శైలప్రాంతము. ప్రవేశము: అదృష్టవంతుఁ డచ్చెరువున]

సీ. పచ్చని మొకమాలు పట్టును విరసించు
నురుశాద్వలంబు లొక్కొక్కచోట
రత్నజాలంబుల రక్తి నపహసించు
నలరు వైనగురివెంద లొక్కచోట
దట్టముగ నలమి దైవతరుల నగు
నురువృక్షసమితి యొక్కొక్కచోట
స్వర్ణశైలంబును బరిహాస మాడెడు
నురుగిరిపంక్తి యొక్కొక్కచోటఁ

తే. గీ. గనియు నీమహాశ్రీయుతవనవిభవము
నిలబిల మలనవనిధుల నెంతొ వెలుఁగు
నిలబిలజుధనాగారము నెక్కనెక్క
మాడు నని పంత మిడక వాయోగు నెవఁడు !

ఇంత కాంతివంత మగునీ కాంతారమునకుఁ బ్రాతము మీఁదఁ జనుదెంచు

టయు మహాభాగ్యము ! అవసానమునకు మున్నె యీయవనీశ్రేష్ఠము నవలోకించుటయుఁ బూర్వపుణ్యఫలితము. ఇఁక నా కిది నిత్యసుఖదము గాకుండు టెట్లు ! ధన్యోస్మి ! ధన్యోస్మి !

మ. ఇదియే నాయనుజుండు తెల్పినవనం బీశాన్యది క్కియ్యదే
యిదియే కాంచనశైలపంక్తి యిదియే యింపొద్ధరీద్వార మి
య్యదియే చిత్రవిచిత్రకల్పితమహాహార్యతుకోశంబు నాన్
బదిలంబై యలరారుపెన్నిధి మహాభాగ్యుండ నే నాదుఁగా.

(అనుచు గుహాద్వారము డాసి) ఔరా ! యేమినిర్మాణము ! ఇది నిశ్చయముగ మనుష్యేతరసృష్టి యనుటకు నీపాషాణద్వారమే తార్కాణము. ఇది మంత్రబలమునఁ గాక యంత్రతంత్రబలమున విచ్చునే! దీని విడియఁజేయునామంత్రపదము సస్యజాతి నొకదానికిని దేవవేశ్యజాతి నొకదానికిని నన్వయింపు చున్నది. ఓతిలోత్తమా ! నీకన్న నింపు నింపు దాని నిఁక వినను. దైవజాతితిలోత్తమపదసంబోధనను విడియునీభూలోకనిధికి భూజజాతిపదసంబంధ ముండకపోదని నానిశ్చయము. దీనిఁ దెలిచి పరికించెద. "ఓతిలోత్తమా !" (అనునంత తలుపులు విడియును దురదృష్టవంతుఁడు లోపలి కరిగి మూసికొనినతలుపులఁ గొంతసేప టికిఁ దిరుగఁ దెలిచికొని వచ్చును. తిరుగఁ దలుపులు మూఁతపడును.)

కం. ఔరా ! ధన్యుఁడ ! ధన్యుఁడ !
సారసువర్ణాంచితబిలసదనము నేఁ డిం
పారఁగ నారసినాఁడను
గోరిక లూరఁగఁ గుబేరు గొబ్బున మీఱన్.

నాకొక్కటిమాత్రము గురుసంకటముగ నున్నది. దీనితలుపులు విడియ నుచ్చరించుపద మది యేమో యిట్టె మఱచు చున్నాను. ఇంతవు నిప్పుడు బయలుపడుము ననుకొంటినా ! కొట్టుకొని చచ్చితి నాపదము జ్ఞాపకము చేసికొనుటకు. ఒకవేళ నా కది జ్ఞప్తికే రాక యున్న నాగతి

యేమి ? ఏ మనుట కేమి ? మరణమే శరణము. అయ్యో ! నావామ పార్శ్వ మేల యి ట్లదురు చున్నది ! ఏమికీడు మూడ నున్నది ! ఆc- యేమియు గాము రాదు. వాతము హేతువున న ట్లదరి యుండు.

తే. గీ., కాకతాళీయముగను నొక్కపుడు పొడము
దుశ్శకునములు ధీరులు తొలఁగి పోరు
భీరు లాసూచనములకు బెగ్గడిలుచుఁ
బూని యున్నకార్యంబులు మానువారు.

నిర్వక్రిమపరాక్రిమక్రిమధుర్యుఁడను ధైర్యస్థైర్యవీర్యుఁడను నగు నేను నాగట్టిపట్టు నెట్టుకొట్టికానిపని. ఇంతవఱకు వచ్చియూ వంతపా లగుట! ఇసీ ! నిర్వృతిఁ గన వే చొచ్చెద. (మూఁత పడిన తలుపుల నరసి) వీని విప్పుమాట నే మఱచునట్లే మాటిమాటికి నివి మూసికొను చున్న వే ! (సాలోచనమున) ఆయుత్తమపద మేమి ! స్మరణకు వచ్చినది "ఓతిలోత్తమా!" (తలుపులు విడియును) మఃఝ్ఝారే ! (అని పోఁ బోయి నిలిచి) నాగుండె దడదడ లాడు చున్నది. కుడు రొదవదే !

శా. ఓరత్నాకరుపుత్రి ! ఓనిఖిలలోకో(త్పేత్తృగాత్రి ! లస
స్నీరేజాయతనేత్రి ! సద్గుణమణీ ! నిర్దిష్టరామామణీ !
క్షీరాబ్ధిజ సితశేషుపై వెలుఁగునా శ్రీవత్సవక్షోమణీ !
సారోదారమతీ ! ముకుందుసతి ! సాక్షాత్కార మా శ్రీ నమః

(అని నమస్కరించి గుహఁ జొచ్చును.)

[ప్రవేశము: మైరావణాది చోరసమూహము.]

(10) అనుబంధము.

మైరా—అరరె ! ఈఖరము లిక్కడ నేల యుండె ? ఎట్లిచ్చటికి వచ్చె ?
నామన మేమో యనుమానమున లీన మగుచున్నది.

(11) అనుబంధము.

చోరు—అగ్న మేలికా ! (అని యందఱు ఆరుగుదురు.)

మైరా—

ఉ. ఎవ్వరి వీఖరంబు లిటు లెట్టులు వచ్చెను నూరు వీడి పెం
దవ్వున నున్న యిచ్చటకు దర్పముతోడుత నెవ్వఁ డైన మా
క్రొవ్వడఁగించి గుప్తఘనకోశము సెలుగ సంగ్రహింపఁగా
నివ్వెఱునుర్క దలంచుకొని యింకల నొకచో డాఁగి యుండునే

ఏమూర్ఖుం డైన నట్టులే తలపెట్టినచోఁ గఱకుకరవాలమున దయా దాక్షిణ్యములు లేక కంఠవిలుంఠన మాచరించు గండరగండండను మైరావణుం డుండె నంచు నెంచ వలదే! వైరివీరనాశను నాశను నను పోరిగొనఁ దరమే! రానిమ్ము వాఁ డైనను సరే పొడ వడఁగించెద. ఏమి నా వెఱ్ఱి! మహాగ్రహాగ్రహావేశమున లేశముఁ బర్యాలోచింపక యిన్ని తలపోసితినే కాని దీన ధనము కల దని పెఱులకుఁ దెలియు టెట్లు! తెలిసి జ్ఞానహీనుఁ డెవఁ డైన నియ్యెడకు వచ్చినను నీద్వారము విచ్చుటెట్లు! లోనికిఁ జొచ్చుటెట్లు సన్మంత్రపదస్మరణ లేక! కానఁ గాన మేము లేక పోయినను వాని కీకాననాశ్రియము లేని పోని శ్రమయ కాని యీనిధి లభింపదు.

ఉ. కాలము తీఱియుండిన నె కాని యెవండును జేరఁ డింకఁ గా
కోలము లైన నావిధముఁ గూర్చి తలంకుచుఁ జుట్టుపట్టులన్
వ్రాలవె యట్టి యియ్యెడకు వచ్చిన మూఢిగ నంటయింటికిం
దే లయి యుండఁడే కరము దిట్టఁదనంబు తొలంగి కుర్కుచున్.

చోరు—(ప్రవేశించుచు) దండాలు నాయకా! యిం వెందు నరుఁ డన్నోఁడే లేఁడు.

మైరా—సరే. మనధనాగారము నొకప రీక్షించి చనుదము. "ఓతిలోత్తమా!" (అనఁ దలుపులు విడినవెంటనే దురదృష్టవంతుఁడు కత్తి జళిపించుచు వెలికి రా "హా! హా కారము" లొనర్చుచుఁ జోరు లెల్లరుఁ దలఁపడి పఱ గొట్టుదురు.)

కుర—హా! విధీ! యీకోశాగారద్వారచ్ఛేదనపదమును జ్ఞప్తికి రాకుండఁ జేయు నేల! చేసియు నిరువురో ముగ్గురో యుందు రంతయ కావున వారి నంత మొందింప వచ్చు నని విచ్చుకత్తి పూని వెలికి వచ్చుసాహసం బేల పుట్టించితివి? నన్ను మట్టు పెట్టించుకేనా! హా! హా! (అని నగర్పుచుఁ జచ్చును.)

మైరా—ఎవఁడు వీఁడు? ఎట్లిది చొచ్చె? బలి! బలి! లెంకలారా! శంకాతంకములు లేక గొంకక బింకమువఁ బొంకమున విచ్చి టకు మనధనాంబకు బలి గా వచ్చి చచ్చినవీనిఁ బరజనభయం కరముగ రెంటుచీలికలు చేసి కవాటమున కీవల నావలఁ గట్టి పెట్టుఁడు. ఆహారమునకు వేళ యయినది రండు. ఈగాసిదలను మానగూడెము లకుఁ దోలికొని రండు.

(12) అనుబంధము.

(అన నాదలు నడుగుచురు) (తెరవాలును.)



తృతీయాంకము:—ద్వితీయరంగము.



[ప్రదేశము: అదృష్టవంతుని యింటిచావడి. ప్రవేశము: అదృష్టవంతుఁడు]

(13) అనుబంధము.

ఆహా! యేమివైపరీత్యము! యేమి మాయావిధానము! ఎంత ఘోర మెంతకూరము!

సీ. పచ్చఁగా నున్నచో వెచ్చనికన్నీరు
విడుచుచుఁ గడుఁ గడు మిడుకు చుందు;

మనకన్న నధికు లై మను చున్నవా రని
పటుతరేర్ష్యను గనఁ బఱపు చుందు
కడుపుబ్బు తీర్చుకోఁ గానికూఁతలు కూసి
లేనివాదులను గల్పింపు చుందు
అరరె ! యెంతటిఁ గోన నధికు లైనా రంచుఁ
బడఁ గొట్టుమార్గముల్ బన్ను చుందు

తే. గీ. ఇన్నియుఁ దమకె నష్టమం చెంచ లేక
అసహనమున ననాగత మరయ లేక
తెలివి తొలఁగుట గురుదూరదృష్టి లేక
సంచరించుచు నుందురు చాల వీఁక.

ఒక్కయుదరమున నుదయ మయినవారే యొకనిఁ గని యొకఁ డోర్వ లేక యుండఁ బరులసంగతిఁ జాటింప నేటికి! నాకుఁ గాసులు లభించె నని కదా యీసున నాయన్న కన్నుకుట్టి కడుపుబ్బు పట్ట లేక చాటు మాటల నెట్లు పెట్టించిరో లేక కొట్టి తిట్టిరో యెట్లు లేని తా నాధనరాశి వశము కావించుకొనఁ దలఁచినాఁడు; కాని పేదవాఁ డని కాని బిడ్డలు కలవాఁ డని కాని దయాదాక్షిణ్యములు పూనినాఁడే ! మఱియు నెంత తెలివి తక్కువ గాఁ బ్రసంగించినాఁడు! "నేఁడు నాకు నీ వీయుదంతము సొంతముగ వెలిపుచ్చ కున్న రచ్చ కెక్కించుటయే కాక నీయంతముం గాంతు" నన్నాఁడు. అట్లు కావించినం దన కేమి వచ్చునో! కాకులను గొట్టి గ్రద్దలకుఁ బెట్టినఁ బ్రయోజన మేమో! అన్నా! యింతటిదే కదా లోకము! తమ్ముఁడు తల యెత్తి తిరిగినఁ దన కును వంశమువారికిని గూడ గౌరవ మని తలఁపనే లేకపోయెను. ఇట్టి స్వార్థపరాయణులు, అసహనధురంధరులు, మూర్ఖులు, కలుషాత్ములు నవివేచనావిహీనులు, ముమ్మరులుఁ గలుగ దేశవృద్ధి యెట్లు! దేశ వృద్ధియే కదా తరతరముల నెల్లరకు నెప్పటికి క్షేమము!

సీ. ఆశాశలం బడి యడలు చుండినవారు
నీవృద్ధిఁ బరికింప నేర్తు రొక్కొ!
అసహనమునఁ బడి యడలు చుండినవారు
నీవృద్ధిఁ బరికింప నేర్తు రొక్కొ!
అహ గంటఁ బెట్టమే యని యడలెడువారు
నీవృద్ధిఁ బరికింప నేర్తు రొక్కొ!
ఆలినగలకొఱకు నడలు చుండినవారు
నీవృద్ధిఁ బరికింప నేర్తు రొక్కొ!

తే. గీ. నీకడుపు చెడఁ బొడమిన నీకొడుకులె
నీదువృద్ధిని బరికింప నేర కుండ
మాత! యింతకన్నఁ గడుపుకోఁత కలదె
యనుచు నుత్తమజను లింక నడల రొక్కొ!

అకటా! ఒకటఁ జింతించి యేమిప్రయోజనము! నడుమ నవతరించిన భాగ్యము నడుమనె యంతరించి నను దురంతసంతాపాక్రాంతు నొనర్చుటయే నా కింకఁ గలిగిన విశేషము శేషము. నాకే మన నేల లోకమున కంతకు నింతయు. అబలులు, అబలలు నీమాయామోహమున మునిఁగి చనియెదరు; సబలులు స్థిరచిత్తులై మనియెదరు.

కుమతి—(ప్రవేశింపుచు) నాయనా! అదృష్టవంతా!

అదృ—వదినే! యెన్నిబన్నములు పడినను దురదృష్టవంతుఁ డదృష్టవంతుఁ డెట్లగు! ఇంతరాత్రి నీ విట్లొంటరి వై రా నేల? ఏల యీతల్లడము తల్లీ!

కుమ—ఉదయమున సదనము వదలి చనిన మీయన్న యర్ధరాత్రికా దచ్చినను మఱలి రామి నామన మల్లల్లాడు చున్నది.

అదృ—ఏమి? నాయన్న యింకను రా లేదా! (ఆలోచనమునఁ దనలో)

అయ్యో! కీ డేమియు నూడదు కదా! నాడెందమునుం దొం దరఁ జెందు చున్నది.

కుమ—తుందుడుకుపని యగుటం దలపోసి నాస్వాంత మిసుమంతయు నిలుకడఁ గన కున్నది. అత్యాశను జనించినయతిసాహసము వెతల మునుచు నేమో యని తలఁకెను. మఱియు నా కన్నియు నమంగళములె కలుగుచు నున్నవి. (కంట నీరు వెట్టును.)

అదృ—అంతగా బెగ్గిడిలకుము మాతా! సర్వము సర్వేశ్వరాజ్ఞాధీనము. దైన్యముఁ బెంచి ధైర్యముఁ గాంచుము. ఇంకను వేచి యీరయిఁ గడపుము. ఉదయముననె నేను నాస్థానమునకుఁ బనివిని సంగితి నామూలాగ్రి మెఱఁగి మసలుదు. ఇంతకన్న నేఁ జేయఁ గల దేమి కలదు!

కుమ—(చను చున్నది.)

అదృ—బాగుగాఁ గనుఁగొన నాగునకు నోగే కారణముగ్ఁ గాడ కట్టు చున్నది. ఏమి తటస్థించెనో!

(14) అనుబంధము.

తెర పడును.

---

తృతీయాంకము—తృతీయరంగము.



[ప్రదేశము: గిరిప్రాంతము

ప్రవేశము మైరావణాదిదొంగసంఘము.]

మైరా—(శీఘ్రముగ వచ్చుచు)

(15) అనుబంధము.

అనుజీవులారా! ఏమి పోసిన హాస్యము! కత్తి చే నెత్తి మన

కుత్తుకలె తుత్తునియ లొనరింపఁ దలంపుఁ గొనె. ఇట్టివాని కిట్టిదియ శాస్తి. అల్లదే వేగుఁజుక్క చక్కఁగఁ బొడిచినది. సంగతు లేమి?

రక్తా—ఏలికా! వక్కరనాసుఁడు నేను రాత్తిరి బలేగమ్మత్తు చేశాము. ఆఁడు ఆఁడదా నేసము నేను మొగోడేసము యేసి కత్తి సేతట్టుకొని ఘూదాకబలానికి బయిల్దేరి వూరంతా తిరిగి వొకయింట యినగొప్పమేడ సూసొచ్చాం. యింటనే యెల్లాయింటిలోని యెలపలితలుపు లన్నీ గొళ్ళేలెట్టి ఆయిల్లు కొల్ల కొడ్తేనే కాని మాబుద్ది నిలఁబడ దింక

5 దొంగ—దాని కేంటి గాని దొరా! యేల్లో గొప్పోళ్ళు తీర్తాలకు మూటలు ముళుపులు కట్టుకొని చెఱువుగట్టున వున్నచత్రింలో తొంగున్నారు. అల్ల నొకచూపు చూస్తే మామంచికోపు.

6 దొంగ—ఓ రింకా నీవు చూసింది మంచిది కాదురా! నే సెప్తాయిను. (మైరావణుసిద్దికైక) సామీ! నేను మంచి మంతరగాఁడినై ఒకలోబోడికి యెంత్రో ఆస పుట్టించి యింటిలోకి సేరి జపం మొద లెట్టి మనకాసులు నాలుగు మోసంగా భూమిలోవుండి తీసినలాగు తీసి వో యెట్టిబాగులోల్లారా! యింతదన మిక్క డుంచుకొని వూరకొన్నారా యిన్నాళ్ళుండి! మీదగ్గరున్న నగలు నాణే లన్నీ యిక్క డెట్టండి. అన్నొయిట్టి మంతరించి యిరవైరెట్లు సొమ్మిక్క డున్నంచి తెల్లారేలోన తీత్తా! నే నయినా లోప లుండ కూడదు. మంతరించి తలుపు లేసే సెల్తా. తెల్లారేక మీరే తీసి సూసుకొండి. అని అంతా ఒకింటిలో పోగు చేసొచ్చా. ఏఁవి సెలవు?

దీర్ఘ—(తొందరగఁ బ్రవేశించి) తొరగా తొరగా లేవాలి దొరా! ఆ ల్లీపాటికి కొండ ల్నడాని కొచ్చుంటారు. మారీసుఁ డాదిగాఁ గలమేం పదిమంది రాంబజనోల్లమల్లే వూరంతా తిరిగి గుంపులు

గుంపులుగా కాసులమూటల్తో యెల్తున్నావర్తకుల్ని చరా
బోల్ని యెంటాడి గెంటు కొచ్చాం యింకాలస్సెం వయితే
సెయి దాటిసల్లే. ఆ సుడదు.

మైరా— లెండు లెంకలారా! లెండు. మీతుఅంగములతో సిద్ధము
కండు. తొలుత మనదీర్ఘజిహ్వునికోరిక తీర్చి క్రమముగా
వీరందఱుం దెలిపినపనుల నెరవేర్చుదము. మీ రొకరి నొకరు
మించి సంచరించుట నాకుఁ జాల సంతస మగు చుండె.
మన కిఁక లోటు లేదు.

(16) అనుబంధము.

అదృ—(ప్రవేశించుచు) అబ్బా! బిక్కుబిక్కుమనుగుండెతో మెండుగఁ
దబ్బిబ్బగుచు నక్కినక్కి యడవులఁ గ్రుక్కుకొని యుండవయ్యె.
యమకింకరులకన్న నిర్దయాస్వాంతు లగునీరికన్నులఁ బడిన నిఁక
మనికియున్నె! ముక్కముక్కలుగఁ జీల్చి చెండాడరే! వీరి బారిఁ
బడి మడియుటకన్న మంచి దని యీవనములఁ దూఱి కడపుట
కాని యందును బ్రాణభయము కాదె! (మెల్లన గుహఁ డాయుచు
నిర్ఘాతపడి) ఏ మది? నాకన్నులు చెదరినవా లేక నా యెడఁద
లోని వెడఁదయే యిట్టివికృతాకారములఁ గనఁబఱుపు చున్నదా!
(తడఁబడుచు జడుపున గుహాద్వారము డాసి) హా! యన్నా!
(అని యొక్కపెట్టున నేలఁ గూలి కొంతసేపటికి లేచి)

(17) అనుబంధము.

అకటకటా! యెట్టికర్మోదయము! ఇది కర్మానుభవము. తప్పింప
నెవరితరము! అయ్యో! యియ్యెడనే మిడుకుచు నిట్లుగాఁ దడసితినా
నేను నీగతి మడియుట నిశ్చయము. ఏమి చేయుదు నీరెండుచీలికలను
నాగాలిగానిపై వేసికొని యూడనిఁ బాడుదును. ఇదియ కర్తవ్యము.



తృతీయాంకము:—చతుర్థరంగము.



[ప్రదేశము: దురదృష్టవంతునిగృహము. ప్రవేశము: కుమతి, గుణవతి.]

కుమ—గుణవతీ! నీయజమానునిమనికి నా కనుమానముగా నున్నది. తొల్లు ద్విష్వినగోతిని దాన పడు ననునట్లు నాపన్నుగడ నన్నే యేడిపించు చున్నది. హా! వైధవ్యబాధ నే నహింపఁ గలనే!

గుణ—అమ్మా! వలదు వల దశ్లీలము పలుకకుము.

కం. తల్లీ! యొందుల కిట్టులు
తల్లడమ్ముం బొందఁ దగదు తాళుము కొంచెం
బుల్లము సరిపఱచుకొనుము
తెల్ల మగు విధాన మెల్లఁ దేకువ నిపుడే.

ధైర్యమునకు సాటి లేదు. ధృతి తొలఁగి మతి కలఁగి యలజడిపడినను గాఁ దగినది కాక మానునా!

కుమ—ఏమో యెట్లు జరుగ నున్నదో! యింతపర్యంతము స్వాతంత్ర్యమున మహాభోగభాగ్యముల ననుభవించిన నానొసట నష్టసృష్టి యేమి లిఖించి యుంచెనో! యెంతటివిపత్తు హత్తునో!

గుణ—జననీ! చేతులారఁ జేసికొని వెనుకఁ జింతించుట వెఱ్ఱితనము. మనదురదృష్టానుసారముగనె దురదృష్టవంతుఁడుగారునుగాఱియ నొందుదురు.

ఉ. ఎందుకు కుందు నొంద జననీ! మనకర్మ మి దంతయుం గటా!
తొందర నొందినం దుదకు దుర్బలచిత్తుల మై ధనంబునున్
మందులపా లొనర్చి మఱి మ్రిందుఁబె కాని ఫలంబు లేశముం
బొందము గుట్టు పట్టి కనుమూసి దినంబులు వెళ్ళఁ బుచ్చువిూ.

బలవన్మరణంబు నరకంబునకు నిశ్చయమార్గం బని విందుఁ గావున నిహాపరసౌఖ్యములం దొలఁగించుకుందు నొంద నేల! మనోవ్యాధికి

ముందే లే దనిరి. తత్తరమొందక తల్లీ! నావాక్యములు చిత్తమున హత్తింపుము.

కుమ—హా! హతవిధీ! నాబ్రిదుకు మొండిబ్రిదుకే చేసితివే!

గుణ—సంగతి నెఱుంగకయ యట్లు నిశ్చయించుకొను టెట్లమ్మా!

కుమ—ఇంక నొకటియు సంగతి. ఎఱుంగున దేమి! ఏయాశపెద యొదవకుండిన రెండుదినంబు లుండునే మఱొండెడ.

గుణ—అదియు విచారణీయము; యయిన సందేహానివృత్తికై చిన్నిబాబయ్యగారి ననిపి యుంటిమి కదా! ఆయన రా కుండ నెదిస్థిరపఱచుకొనుటకు నలవి కాదు.

[ప్రివేశము: అదృష్టవంతుఁడు]

## (18) అనుబంధము.

హా! హా! విధికృతము! విధి యింతఁగో నీ కీవిధ నవ్రాఁత వ్రాసె నమ్మా! యని నే నిమ్మానిని కెట్లు వినిపింతు. బేలయై నేల వ్రాలుచుఁ గన్నీరు మున్నీరు గా గోల పెట్టునీవాలుఁగంటిఁ గనుఁగొటినా నాధోదారమానసమును నీరుగా మాఱదే!

కుమ—అదిగో! మఱిఁదియు వచ్చి నోరు తెఱచి వినిపింప నేరక పరిపరివిధములఁ బరితపించున ట్లున్నాఁడు. నా కింక నేటియాస. హా! జీవితేశా! జీవములఁ బాసితివా! (నేల కొరగును)

గుణ—ఊఱడిలు మమ్మా! ఊఱడిలుము! (అదృష్టవంతునితో) దేవా! అన్నగా రగుపడిరే?

అదృ—అగుపడ కేమి సగము సగముగ నగములదరి విగతజీవుఁడై-

;పణ—హా! ప్రిభూ! (అని కన్నీరు విడుచును)

కుమ—హా! నాథా! ప్రాణనాథా! (నెత్తిమొత్తుకొనుచు స్మృతి తప్పును)

గుణ—శాంతిలు మమ్మా! శాంతిలుము (డగ్గరి యుపచార మొన రించును)

అద్రి—అకటా! యెంతసంతాపము!

శా. నేలం గూలిన నత్తి మెత్తుకొనినన్ నిర్వ్యాత్తిమై నేడ్చినన్
ధూళిం దూలిన వారి పీరిఁ బెలుచన్ దూషించి శోషిల్లినన్
గ్రాలుఁగన్నులఁ జీలుకొన్న నుడలం గారించినన్ వెండియున్
దేలే మాతని మాత! ధైర్యగుణమున్ దెంపున్ వహింపన్ వలెన్.

కుమ—(సేద దేరి) హా! అతులసాహసగుణా! అప్రతిమానమాన ధనా! అకాలబలవన్మరణము-హా! (అని వెండియు మూర్ఛిల్లును)

గుణ—గుండె పగుల వగలఁ బొగిలినఁ గార్య మేమమ్మా! శోకానల సంతప్తస్వాంతవు కా వలదు. కుదురుపడుము (విసరు చుండును)

అద్రి—అయ్యో! బేలవై వాపోవుదు వేల! వదినే!

శా. అమ్మా! భూరిపరాక్రివిక్రమము లత్యంతప్రతాపాములున్
దమ్మున్ రక్షణ సేయునే యజునివ్రాతల్ తప్పునే తాను మీ
విమ్మాశ్కిన్ విలపింప నేమి యగు నింతే నోఁచి యున్నావు క
ర్మమ్మంతే మఱి వానికిం గనుకఁ బల్మా ఱేటికిం గుందఁగన్.

నెమ్మది వహింపనిచో నమ్మా! మనము క్రిమ్మర మహాపదం జొత్తుము. గుణవతీ! నీ వొక్కింత చెంతకు రమ్ము. రహస్యమ్ము నీతోఁ జెప్ప వలయు.

గుణ—(కన్నీరు తుడిచికొనుచు వచ్చును)

అద్రి—ధైర్యశాలినీ! గుణవతీ! నీ నేర్పునఁ గాని మన కోర్పలవడదు.

కం. క్రార్యముఁ జిక్కంబట్టుచుఁ
బర్యాలోచించి గట్టిపట్టుఁదలమయిన్
గార్యం బొనరించిన మన
మర్యాదయు నిలుచు భ్రాతమానము దక్కన్.

రెండుగాఁ జీల్పఁ బడినమనసుచే దృష్టవంతు నిశరీరముఁ దిరుగ నొక్కటిగఁ గుట్టింపించి—అతినిగూఢముగ నతిజాగ్రత్తగ నత్యల్పకాలమునఁ— గుట్టింపించి వానికి దేహారోగ్యము చెడినట్లును, మరణశయ్యా నున్నట్లును బలిపి యిరుగుఁబొరుగువారి కనుమానము లేకుండ, గనుమూసి గంత కట్టి గుట్టుగ మట్టిఁ బెట్టినఁగాని మనమనికి దుర్ఘటము. సమయాను కూలముగ నంతయుఁ బిదప వినిచెదను. వదినె నెట్టులో యోదార్చి కర్తవ్యముఁ గావింపక తప్పను. ఇఁక నంతయు నీదే భారము.

గుణ—హా! యేమిఁగతి సంభవించినది. (నిట్టూర్పు పుచ్చి కుమతి డాయును.)

అదృ—

(19) అనుబంధము

తెర పడును.





శ్రీ

సంగీత

# అదృష్టవిజయనాటకము.



చతుర్థాంకము:—ప్రథమరంగము.



[ప్రదేశము: వీథి. ప్రవేశము: గుణవతి.]

**(20)** అనుబంధము.

ఎట్టిమర్మరణము ప్రాప్తించెను స్వామీ! దురదృష్టవంతా! కోపిష్టుండ వైనను నాపై నెంతప్రేమఁ గనఁబఱుపు చుంటివి! ఓదురదృష్టగుణవతీ! కనిపజనకునివిధముఁ జెరుచు చున్నదురదృష్టవంతు నెడఁ బాయుట నీకును సంతాపమే! అయ్యో! నాజననికుమతి యెంతగా విలపింపు చున్నది! కడుగడుసరి యైనను గయ్యాళి యైనను నాపె దగుపాతివ్రత్యము మెచ్చ వచ్చు.

తే. గీ. కన్నవారు భీతిని గొనఁ గన్ను మోడ్చి
విన్నఁదన మేగ మన్నుపై నున్నరొదు
నీలిఁలు కైలఁ బట్టి హా! జీవితేశ!
పాలకా! యని పలుగాఁజు సోలు సొమ్ము.

నోటఁ దడియాఱుట నతిదుఃఖ మూరుట నన్నియు నసంపూర్తివాక్యము లుచ్చరించునే కాని నోరారఁ బల్కదు. ఆహారము నీరముఁ దొఱఁగి యొక్క పగిదినే వెక్కి వెక్కి యేడ్చుచు సొక్కి సొమ్ము

చున్నది. అప్పారిగాఁ గారునవ్వారిధార నేరు నడ్డుపఱుప లేరు! హా! అర్థాంగి యన నామెకే చెల్లును.

సీ. వైవాగ్ని సాక్షిగాఁ దన్ను పెండ్లాడిన
పతిఁ బాసి యేసాధ్వి బ్రిదుకు నవని
నతులితప్రేమఁ ద న్ననిశము నరసెడి
పతిఁ బాసి యేసాధ్వి బ్రిదుకు నవనిఁ
గష్ట మొదవ కుండఁ గాంచి భరించెడి
పతిఁ బాసి యేసాధ్వి బ్రిదుకు నవని
నార్జించుపుణ్యంబు నర్థం బొసంగెడి
పతిఁ బాసి యేసాధ్వి బ్రిదుకు నవనిఁ

తే. గీ. బగలు రేయియు ననక తా వగలఁ బొగిలి
కాయకష్టములకు వెనుదీయ కెంతొ
సంసృతి భరించి వ్రతదీక్ష సతిని సాఁకు
పతిని బాసి యేసాధ్వి తా బ్రిదుకు నవని

కృశించి కృశించి యీసాధ్వియు నశించుట నిశ్చయము. అక్కటా! పచ్చనికాఁపురమున కెట్టియిక్కట్టు దాపురమైనది! అయ్యో! పండు వంటి సంసారము పాడగుటయే కాక రెండుసంసారము లొక్క సంసార మగు చున్నది. దురాశ దుఃఖ మ్మొందు రిందుకే. అయ్యో! విధివిధా నము! ఛీ! కాల మింతలో నెంతమార్పుఁ జెందినది! కాలచక్రమా! నీయావేగము ననుసరింప నెంతవింత! ఒక్కప్రక్క నొక్కని నూర్ధ్వ మునకు లేపి మఱియొక్కప్రక్క మఱియొక్కని నధోగతికిఁ బాలొన ర్తువు. యుగముల యుగముల నొక్కమొగిని గడపుచును బామరులకు నీవేగమును గనఁ బఱపవు. నీమార్గము నతిసూక్ష్మదృష్టి ననుసరించు వారికే స్థితిగతు లెఱుఁగఁబడును. అయ్యో! యేమి నేనీమార్గమున నింతతడవు మసలితిని! త్వరితగతిఁ బంపిని వినయాధరు నెట్టెట్టో

యొప్పించి రప్పించ నలయుఁ గదా! నాదురదృష్టవంతుని సదనమునకు (అని చనుచు.)

(21) అనుబాధము.

ఇఁక నాయీతాలపోతలకుఁ దలుపులు వైచి యీతాలుపులు కొట్టి నాంత ర్లంపుల నీవినయేగిధునకుఁ దెలిపెద (ఒకద్వారముఁజేరి) వినయంధరా! వినయంధరా! (అని తలుపులు కొట్టి పిలువ లోపలనుండి "ఎవరు వారు?" అని వినవచ్చును.)

గుణ—గుణవతి యనుదాన. నీతోఁ గొంత మాటలాడ వచ్చితిని వెలుపలకుఁ జెచ్చెర వచ్చెదవా?

విన—(వచ్చి కన్నులకుఁ జేయడ్డిడి కాంచుచు) బాలికామణీ! నిన్ను నేఁ బోలుపఁ జాల. దృష్టి యానుట లేదు. కంఠస్వరమైన మును వినినట్లు తోఁచదు. నివచ్చినపని యేమి?

గుణ—తాతా! కొంత వింతకుట్టుపని కలదు.

విన—మనుమరాలా! వణఁకు జనించుట నే నాపని నాతిఁగా నొనరుచుట లేదు. కాళ్ళు లటలట లాడుచున్నవి. కన్నులు కనుపింపవు.

గుణ—ఈరెండునాణెములుఁ గైకొని (చేతులఁ గాసుల నిడి) యెట్లైనఁ గుట్టుమువు రమ్ము. పిన్ననాఁట నుండియు నీ కిదేపని యగుటఁ గనుపించినఁ గనుపింప కున్నఁ గష్టము గాదు.

విన—మానివేసితి ననియు వినుపఁ జాల కాని నాపని నీవు మెచ్చు వచ్చునో లేదో యనుజంకు. ఇంత హెచ్చు వెల నిచ్చితివి కదా!

గుణ—అంతపనితనముఁ గనఁ బఱుప నక్కఱ లేదు రమ్ము.

విన—రమ్మను చుంటి వెక్కడకు? ఇక్కడనే చేసివేసెదను; ఇక్కడికే తీసికొని రా వలయు నాకుట్ట నగునది యేదియో

గుణ—తీసికొని రా వీలు లేమినే నిన్ను తీసికొని పోఁ దలఁచుట

విన—అమ్మ! అమ్మ! నాయెత్తు కాసులు పోసినను నే నిప్పుడు రా లేను

గుణ—నీయెత్తుకాసులు పోయ లేను గాని నాయెత్తు నెరవేఱిన నే నీయెత్తుకాసులు మఱి రెం డీయ నుంటిని. నల్లమందు పట్టిచ్చిన యిప్పట్టున రా కున్న నెప్పుడు వచ్చెదవు? నాచెప్పిన చొప్పున నొప్పినం దాతా! నీకుం జాలలాభము. కట్టె, నూంతం గొని నాతో నీవుం జనుదెంచెదవా మఱి కొలతెదూరమునన నే మఱి రెండుకాసులు లభించు నంటి వింటివే?

విన—ఊం అట్లయిన నడుపుము మెల్లంగ వెన్కనము. నీ వింతవింతగట్టి పట్టు పట్టు చుండుట నేను మా ఆడ లేక వింతకట్టుపనికి వచ్చు చుంటి.

గుణ—రమ్మి (కట్టెతో నడిపించుచు) ఇది ధనమహాత్మ్యము!

(ఇరువురు నిష్క్రమింతురు.)

---

## చతుర్థాంకము—ద్వితీయరంగము.

[ప్రదేశము: గిరిప్రాంతము. ప్రవేశము: మైరావణాదిచోరులు]

మైరా— (22) అనుబంధము.

ఉండుం డుండుండు. ఇంకను జెంతం జేరినం గాని యున్నవియు లేనివియు నిరూపించుట కష్టము. (గిరిగుహం జేరి) అ—అ—అనుజీవు లారా! ఏవి! యేవి! మన మీ యొక నిలిపిన కళేబరార్థభాగములు! ఏమి! ఏమి! మాయయా! మంత్రమా! తంత్రమా! స్వాతంత్ర్యమా! మాంసాశనజంతువులు గొని చనుటకు నలవి కానంత గట్టిగం గట్టితిమి. అవియే కాని చనిన వానియాడుపులజాడ లేవియు లేవే! ఇవిగో, పాదచిహ్నములు! ఎవం డీసాహసవంతుండు! ఈ ధైర్యస్థైర్యశౌర్యవీర్య

ములఁ బోలుపుగ వచ్చువాఁ డా వచ్చినవాని నెచ్చెలికాఁడో బాదుగుండో సోదరుండో యయి యుండు. వీరిరువురకును మనధనాగారరహస్యము వెలి యయి యుండు. కోశముం జొచ్చి కాంచనముం గాంచినం గాని యనుమానమ్ము నామానసమును వీడదు. (ద్వారము డాసి) "ఓతిలోత్తమా!" (పిలుపులు వినుచు) సంచుల నెల్లఁ గొని యొక్కరొక్కరుగ లోని కేతెంచుచుండు (అని లోఁ జొచ్చి వెలికి వచ్చి యాలోచనమై నిలువఁ జోరు లొక్కరొక్కరుగ సంచులు లో నిడి వెలికి వచ్చి నిలిచెదరు.)

మైరా—సంచుల దొంగిలించినట్టులును గనుపట్టదే! ఆహా! అందఱిఁ గన్ను గప్పి నే నెప్పు చూడ నితం డెవండో నాకన్ను కప్పి చొప్పిలు చుండె! వంచనకుఁ బ్రతివంచన! నిర్భయముగ గర్భనిర్భేద మగునగములనడుమకుఁ జనుదెంచుటయే కాక కళేబర భాగములఁ గొని చనుటకును సాహసించెనే! మాయానుపానులు బాగుగ నెఱింగినం గాని యామాయావి మాకుం గనంబడక తప్పించుకొనం గలుగు నెట్టులు! అతం డీప్రాంతజానపదుండే యయి యుండు! దూరస్థుండయి యుండిన నింతటనంతట రాకపోకలు సలుపఁ గలుగు నెటులు? నామనము నిటులు సలుపఁ గలుగు నెటులు! అతని మట్టుపెట్టినఁ గాని మాగుట్టు బట్టబయలు కాక మానదు. తటి వేచి మమ్మందఱిఁ బొరిఁగొని యీతఱిఁ గనిధనమును బరిగ్రహింపఁదలంపఁడే యేమి? కానిచో జాంబూనదం బేల కొని చనఁ డయ్యో! అదియుఁ గొనియే యుండు. లెక్కింపఁ దరము గాక యెక్కుడుగ నున్న వీనితఱిఁ గరయరాదు. నా కేదియుఁ దోఁచకున్నది. నామానసము డోలాయమాన మయి యెన్నఁడు లేనియలజడిఁ బొందుచున్నది. ఇంక స్వర్ణముఁ బెం పొనర్చుతలంపు పూర్ణముగ.

దొలఁగించి యింతనిశ్శంకమై సంచరించుచున్నాఁడు గీని గండడదం గించినం గాని కుదు రొదవదు. ఉంకున దుంగీన లేనిదానికై విచారింప వలయు.

మారీ—నాయకా! యెప్పుడూ లేనికలాహీనాన మీయాసన మగ కష్టా వుంది; యెందుకో మే మెఱుఁగ నగునే!

మైరా—మారీచా! అసహాజచింతాక్రాంతస్వాంతుండ నై యుండుట సత్యమే! కనఁ బడనికళేబరవిషయము సామాన్యమే?

(23) అనుబంధము.

దీర్ఘ—అయ్యో! అట్లనొద్దు దొరా! మే ముండఁగనే బయ్యమా! గుండె త్తెగఁ బొడిచెయ్యం యేఁడైన నీడ కొచ్చాఁ డంటే

మారీ—ఆచోకీ యింతలో తీసి పీఁచమడంచేసేవకుం డీఁ డుండఁ గానే యీకంగా రెందుకు? మారీచుఁడికంటంలో ప్రాపిరిలుండేదాఁక ఈ బేజా రెందుకు? ఏంవాసతి!

మైరా—

ఉ. అంతటివాఁడవే యగుదు వంచుఁ దలంచెదఁ గాని దీన నొ
క్కింత తలంకుదున్: సులభుఁడే యతఁ డైన బిత్తానఁ గాన నిం
తింతలు సేయునే! మరియు నియ్యది ఘోరతరాస్త్రయుక్త కా
లాంతకతుల్యవీరపురుషాధికరక్షణ మంచు నెన్నియున్
నీమాయోపాయము లీయెడ నిష్ప్రయోజనములగు నేమో!

మారీ— సాధించుకు రాకపోతే యిసుగో నాతల బలిచ్చేస్తా. ఊఁ అంతే నాచక్తి! ఆరాడాలిచిగ్గొయ్యి! యేం పంతబమ్మాండం!

మైరా—దూరము విచారింపుము. ఏ లన

ఉ. పంతము తీర్ప వేని విను పాపున నుండినవాఁడ వంచు నా
స్వాంతమునం దొకింతయును జాలి దలంపను దప్పకుండ నీ

యంతయుఁ గాంతు వ[illegible]ము నంతటఁ [illegible]ంచి తలంపు మిప్పుడే
యెంతయుఁ జింత నొందినను నేమిప్రయోజన ముండ దాయెడన్

మారీ.—ఓ సామీ! నే నిందుకు నందుకు సిద్ధం

మైరా.—అయినఁ బోయి రమ్ము. (చనును)

మారీ.— **(24)** అనుబంధము.

## చతుర్థాంకము:—తృతీయరంగము.

[ప్రదేశము: దురదృష్టవంతుని గృహము. ప్రవేశము: గుణవతి విచారముగ.]

ఉ. అక్కట ! నీవు కూప మిఁక నాయయమే దురదృష్టవంత ! నీ
కెక్కడ దాపురించె నిటు లింతటిలోన దురంత మయ్యయో !
త్రొక్కినుమల్ వధింపుమను దోకమునై యభివృద్ధిఁ గన్న యీ
యిక్కరు నాకు నెక్కిమొగి నింతటిలోన ఋణంబు తీర్చెనే.

అయ్యో ! కన్నతల్లియు నున్నయిల్లును నొక్కటి యని యాంధ్యవర్యులు నొక్కి వక్కాణింతురు. ఇదియుఁ గల్ల నగుచుండె. హా ! జనకా ! సంతానహీనుఁడ నైనను ధనధాన్యముల నోలలాడు చున్ననినే యదృష్టవంతుఁడవు నీతమ్ముఁడే దురదృష్టవంతుఁ డనుకొంటిమి. ఇట్లగుననియు సార్థకనాముఁడ వగుదు వనియుఁ గల నైనఁ దలఁపము.

శా. నిన్నున్ బాయఁగ లేనికారణమునన్ నీజాయయున్ నిన్నె తా
వెన్నాడెన్ వపువున్ భరించి మనుజీవిన్ నేనె సూనుత్వరన్
గన్నన్ నన్నిల నొంటి వీడితిరి మీకన్నన్ మేలిప్రాపిక నా
కున్నే భూమి నదృష్ట మొక్కఁడెకదా యోచించి వీక్షించినన్.

జ్ఞానంబు రాకయే కన్నతలిదండ్రులఁ గోలుపోవుటచే నా కానంత యూ వంతయు లేదు. కాని పుట్టి పెరిఁగి బుద్ధి వచ్చిననాఁటనుండియు నిచ్చట నే

ముద్దుముచ్చటలు నెరపుచు గృహకృత్యములు నెరవేర్చుచు సంచరించుటం గన్నులం గన్నయీమాతాపితలమరణము నన్ను మిన్నుగఁ ఖిన్నురాలిం జేయుచున్నది. ఎంత తెగువం బూనం దలంచినను వారిస్మృతి స్మృతికి రాకమానుట లేదు. దుఃఖముండదే యెవరివగుఘృతక్షీరదధ్యాదులను బంచభక్ష్యపరమాన్నములను జిలిబిలిపలుకులనూ జిలుగువలువలను తిని విని యనుభవించి శైశవముం బాసి బాల్యముం ద్రోసి యౌవనము డాసి మను చుంటినో యట్టివారు దుఃఖ మెట్టులు రా కుండు లేకుండు ? ఈనవావయవములు, నిరంతర మారోగ్యకవోష్ణరక్తసిక్తము లైనయీనాళములు, అవి యివి యన నేల యీపాదమస్తక మీావపువు, ఈవ్యక్తి, ఈవిమలబుద్ధివికాసము, వారియుప్పుపులుసులో నెప్పుచుండ వారి స్మరణకుం దేక యుంచుట కెంతకృతఘ్నురాలం గావలయు ! ఈమూర్తిసర్వము వారియొక్క సారపదార్థభూయిష్టమై యుండ మఱచు టెట్లు ? ఈదేహ, మీాయూహ, యీాస్వాభిమాన, మీాజ్ఞాన, మరిగిన వెనుకనే వారి మఱచుట. ఎన్నఁడు నెవ్వరియెడ విశ్వాసఘాతుకరాలు కాం జాల దీగుణవతి (అని విచారింపు చుండును.)

[ప్రవేశము: విచారమున నదృష్టవంతుఁడు.]

## (25) అనుబంధము.

ఓ సృష్టిస్థితిలయకాలభూతా ! యేల యింతలో నింతం జేసితివి ! అన్నను వదినెను గూడ హత మొనర్చితివే ! నాచేసినదోస మేమి ! మానాభిమానమున నెన్నిబన్నముల నైన నోర్చి యీదుస్తరదారిద్ర్య పారావారమున నీదులాడు చుంటినే కాని, నోరు తెఱచి యన్నా ! నీవు వినా నా కన్య లెవ్వరాప్తు లని పాదములం బడిన నాపేదరికము నీకు నే దయిన దారి చూప కుండునే !

చం. పటుతరవీర్యశాలి ధనవంతుఁడు మాన్యగుణాకరుండు సం
కటముల నెట్టులో కెడఁపఁగాం దలపోయక యుండువాఁడై నేం

గటకట మోఁది య ప్డతనికాళ్ళపయిఁ బడి తప్ప దన్న నా
దిట మెడఁ జేసి నన్నిటుల తీరనివంతలఁ ద్రోసితే విధీ!

అక్కటా! చేదోడు వాదోడుగా నుండు సైదోడును సమయించి నాకుడి బుజముం ద్రుంచితివే! ఆసయు నండయు లేకుండఁ జేసితివా! ఆహా! యిట్టి యూహాపోహములఁ జింతింపు చున్నఁ గార్య మేమి! ఈగుణవతి నిక్కడ నుండి తొలఁగించి నాయిక్కడకుఁ జేర్చి యన్నియు సరిపఱచెద. (గుణావతి డాసి) బాలా! యేల చింతింప? వేయేఁడులు తలక్రిందైనను నిఁక వారు మనకు రారు.

మ. అతిబాల్యంబునఁ దల్లిదండ్రు లరుగన్ హా! నిన్ను నాయన్న తాఁ
గుతుకంబొందుచుఁ జేరఁ దీసి పెనిచెన్ గూఁతుంబలెన్ మక్కువన్
సతతంబున్ గయిసేఁతతో నవద యస్వాతంత్ర్య నాకుండ దు
ర్గతి రాకుండఁగ నీయదృష్ట మయినన్ గాపాడ లేదయ్యెఁగా.

గుణ—దేవా! ఇది సమస్తము నామురదృష్టము. కానిచోఁ గన్నవారు కలఁ వైనను లోటుపాటు లేక మనునాకు మనుచు చున్నవారును గలఁ నగుట యేల!

అదృ—కన్యారత్నమా! కలుకటపడకుము. నిన్నన్నివిధముల నాయఱుత నసువులు కలపర్యంతము నాయన్న కాంచి యున్నవిధముననే కాంచెద. ఆసందేహము నీడెందము పొంద కుండును గాక!

గుణ—స్వామీ! న్యాయాన్యాయవివక్షణులును సన్మార్గప్రవర్తనులును శాంతిస్వభావులును భావనులును నగుమిమ్ముఁ గొల్చుట నాభాగ్యము: కాన నామానసమున ననుమానము లేశమును లేదు. నా కొకటియు మీ కొకటియునా!

అదృ—గుణవతీ! యిఁక నాగృహము నలంకరింప రమ్ము.

(26) అనుబంధము.

(ఇరువురు నిష్క్రమింతురు.)

## చతుర్థాంకము:—చతుర్థరంగము.



[ప్రదేశము: గిరిప్రాంతము. ప్రవేశము: మైరావణాదిచోరులు]

(27) అనుబాధము.

మైరా—భళీ! మారీచా! భళీ! ఏది నీసమాచారము కులాసాగముగ సాంతముగ శాంతముగ వినుపుము

మారీ—దొరా! నే నదట్టున శాన్న తిరిగి తిరిగీ వూరుచివరున్న కుట్టు కుట్టేయినయాదరుఁ డనే మునలోఁడింటికి సేరా. అక్కడఁ గూకుని నెమ్మదిగా అన్ని ఆమాటల్లోకి యీమాటల్లోకి దింపే సరికి ఆపెత్తావన్లో ఆఁడు అరె! ఒకఆఁడది యీమద్దినే నాకు రెండుకాసు లిచ్చి నాలుగుదార్లు కలిసేచోటికి తీసి కెల్లి నిలఁ బెట్టి మల్లొండుకాసు లిచ్చి కళ్ళు గట్టిగఁ గట్టి కఱ్ఱ చేతఁ బట్టి అటు తిప్పి యిటు తిప్పి తిప్పీ తిప్పీ ఒకింట్లోక తీసికెల్లి నా సే తేదో కుట్టింపించింది. నా కది చన మేమో యనే యనుమాన మన్నాఁడు.

మైరా—ఆఁ—ఆఁడుదియు నింమ నేకీభవించినదా! (తనలో)

తే. గీ. ఔర! పేరిని మించినవారు వారు
వారి మించి యుండెడువారు వీరు; పన్ను
గడకుఁ బన్నుగడయు నెత్తుగడకు నెత్తు
గడయుఁ దీసి పో దెవరికో కడకు గెలుపు.

దీన వారును దిట్టలే యనియును మమ్ముం బోలి యేమఱక కాపుఁదల మీఁద నే యున్నా రనియు స్పష్టము. (ప్రకాశముగ) అనంతరము!

మారీ—అంత నేను అది చవమే యండానికి నీ కేంటిగుర్తు తాతా! యనఁగా నాయనా! సగానికి చీ లుందోయీ! చేతులతో తడిమితే కాళ్ళు సేతులు వగైరాల్లాగ తగిల్నాయి. గరిమీాసాలు,

సొట్టంగా చనమై నయ్యుండాలి లేక రమారమీ ఆఱడుగులెత్తు బొమ్మయినా అయ్యుండాలి. కాంతిబొమ్మంటదా యని నాసందేహ మన్నాఁడు.

మైరా—అతనియూహ సరియే. మనము పోలియించినవాఁడును రమారమి ఆఱడుగులే యుండును. బుగ్గమీసములు, కావున నిశ్చయముగ నాతఁడే. ఆరెండుచీలికలను వానికన్నులు కట్టి కుట్టించిరి. శవమే కాక బొమ్మయే యైన వానినయనములు మూయనేల! ఆమాత్రపుఁబనికి నాలుగుకాసు లీయ నేల!

మ. బలవంతాంతముఁ బొందియున్న వపువున్ బైకేమిరాకుండ లో
కులు జాడన్ గనిపెట్టకుండ నటులున్ గుప్తప్రకారంబులన్
సలుపన్ జాలుదు రెన్నియైన నదియేశాంపబో కా నింతలో
వెలియై సుబ్బను బాపమొందైన వ్యాప్తిం గాంచకే డాఁగునే.

ధనమూ వ్యయమగును; అనుమానమూ పెంచును; నిజవృత్తాంతమూ శాంతముగ సాంతముగ వెలువడును; మానభంగమూ యగును; లోకనిందయూ పొందును. సరే తరువాత?

మారీ—నేను నీలాగే శంకించి సామీ! ఆడింలో నే సెప్పినట్టల్లా సేయి నీకు నే మేలుసేస్తా. అ దిచ్చినదానికన్నా రెండుకాసు లెక్కువిస్తా నీ కన్నా. అంతే పోనద్దు బాబూ! నా కిన్నిగొడవ లెందుకు? నీ కన్నిపాట్లెందుకు? ఏదో అయిందిపోయింది అని సెప్పాఁడు.

మైరా—ఆవృద్ధుఁడును టక్కరిగాఁడే! పిమ్మట?

మారీ—నే నూరుకున్నానండీ? యీలాంటియ్యన్ని దాఁగడిపోతేతాతా! యింకేంవన్నా లోకం వుంటదా? రేపు నీయింటోఁడికే ఆలాగైతే వూరోకోవలసిందే? దీనిసమాచారం వేంటో సూద్దాం. దొరుకుద్దా దొరుకుద్ది లేకపోతే లేదు. ఇగ్గో యీరెండు

కాసులు తీసికొని రొండిన్దోపు ముందు చెప్తా: అనే సరి కుప్పాం గిపోయి యేమి సెయ్యా ల్సెప్పు అన్నాడు.

మైరా—కనకమునకుఁ గానిపని యేమి కలదు! వెనుక?

మారీ—ముందు మనమూనాలుగీదులు కలిసినచోటి కెల్లాం. అక్కడ్నేను నీ కది కట్టేసినట్టే కళ్ళు కట్టేస్తా. ఇప్పుడు నీ వెలాగెలా గెటువై పెటువైపు తిరిగి తిరి గెల్లావో ఆలాగే యెల్లు నిన్ను నే నెంబడిస్తా వస్తా నన్నాను.

మైరా—ఏయుపాయము లేనియుపాయమే! తరువాత?

మారీ—ఆయిదంగా ఆయెన్క అంతా సద్దనిగింతరోత అద్దరాతిరి కాడ మేమిద్దరం బయల్దేరి యెల్లాం. అబ్బా! యెన్ని సందు లెన్ని గొందులు ఎంతదూరం యెంతదూరం యెత నేరుపుగా యెంకోరుపుగా తిప్పి తిప్పి తీస్కెల్లిం దండీ! బాబూ! వాకాళ్ళడిపోయాయి. పాపం! ఆముసలోడూ ఆలాగే కాసుల కాసపడి పడిపోకుండా ఆయండ నీయండ సేర బడుచూ బడి తట్టుకొని తడఁబడుచు నడఁగుచు సచ్చిచెడి వచ్చాడు.

మైరా—ఊరును గా దనువాల్లు పన్నినపన్నుగడ. స్త్రీ లన్న నే మను కొన్నావు!

తే. గీ. ఇట్టిగుప్తకార్యముల నెందేని కనుము
స్త్రీసహాయమో, యెఱుకయో, చేతయో, ని
పుణతయొ యెదియొ కలుగక పోదు పోదు
కాంత లెంతజాంత లెఱుఁగఁ గాదు రాదు.

వారిమాయలు వారిహాయలు వారిహావభావములు దైవమునకుఁ దెలియఁ బడ నన సందియము నొందఁ బనిలేదు. అనంతరము?

మారీ—ఆలా గెల్లిఆయి ల్లానా లట్టలే ననేబయ్యంచేత-ఏమో కాటు చీకట్లో యే దని సెప్పను-దానితలుపులమీఁద తెల్లనిగుర్తు

లెట్టుకొని ఆముసలోఁడి కిచ్చేసే యిచ్చేశా. కా నంతట్లో తొందరపడక తెల్లారఁగానే లేచి ఆయి ల్లేరిదో కనుక్కుందామ నెల్లేసరి కాయింటోఁడు సచ్చిపోయినందున అక్క డేమూ లే రనిన్నీ ఫలానాచో టాఁడితమ్ముఁ డున్నాఁ డనిన్నీ తెలిసింది. మంచిపని సేశా ననుకొని దీపా లెట్టేయేల యింకొకీదిలో వున్న ఆఁడింటి కెళ్ళి ఆతలుపులమీఁద తెల్లనిగుర్తు పెట్టుకొని వచ్చా. ఇంతకట్టపడి తేనేగాని వానిగుట్టుమట్టు పూర్తిగా తెలిసిందికాదు. ఏలికా! యియ్యాలరాతిరే మనవంతా చీమ చిటుక్కు మనకుండా చటుక్కు నెల్లి ఆనాళ్ళట్టుకొని ఆయింటోల్లందఱ్నీ కటుక్కు కసుక్కు మనఁగా తెగేసేసి రావాలి.

మైరా—కర్తవ్యమే యది మనకందఱకును. లెంకలారా లెండు.

(28) అనుబంధము.



29 వ పుటలో 7 వ పంక్తి.

| తప్పు. | ఒప్పు. |
| --- | --- |
| ఆలినగలకొఱకు నడలు | ఆలినగలకొఱ కడలు |





శ్రీ

సంగీత

# అదృష్టవిజయనాటకము.



పంచమాంకము:—ప్రథమరంగము.



[ప్రదేశము: వీధి. ప్రవేశము: గుణవతి సాలోచనముగ]

(29) అనుబంధము.

సూక్ష్మగ్రాహియు నతిసూక్ష్మదృష్టిపరిశీలనయు నగుగుణవతి యింతయు నేమఱక యుండుట నెఱుఁగరు వారెవరో! ఇదివఱకిడినవి తెల్లనిగుర్తులు! ఇవి యెఱ్ఱనివి. ఇంతకుమును తలుపులపైఁ బెట్టిరి. ఇప్పుడు మాఱుమూలఁ బెట్టిరి.

ఉ. దీనికిఁ గారణం బెదియొ తెల్లము కాదు వృథాప్రయాసముం
బూనరిఁ కెవ్వరున్ సుగుణపూర్ణుఁ బ్రశాంతు సదృష్టవంతునిన్
మానక మోసపుచ్చ నవమాన మొనర్పఁగఁ బట్టు పట్టిన
ట్లీనవచిహ్నముల్ తెలుపు నెంతయు నేమిటఁ జేయుఁగా వలెన్.

ఈయదృష్టవంతునకు యాదృచ్ఛికముగఁ గాంచనము లభించుటయు నది యుతఁ డతిరహస్యముగ నెంతేఁ బొందుపఱచుటయుఁ గృత్రిమవృత్తిఁ గుమతి యారహస్యము గ్రహించి భర్తకుం దెలుపుటయు నతఁడు తమ్ముని గలిసి కలస్థలముఁ దెలిసి నగములనడుమకు వెడలి విగతజీవుఁ డగుటయు వానివిభాజితశవభాగము లదృష్టవంతుఁ డతినిగూఢముగ

నేకముగఁ గుట్టింపించి మరణశయ్య నున్నట్టు వెలువడించి కొన్నాళ్ళకు మట్టిఁ బెట్టించుటయు దక్కుం గలయుదంత మాద్యంతముఁ దెలిసి యుంటి. ఇది యంతయుం దలంపం దీన నేదియో యాపద దాపురించు ననియు దానిఁ దొలఁగిసిపుచ్చ నీతఁ డివి యన్నియుఁ బన్నుచున్నాఁ డనియు ధ్రువ మయినది.

సీ. పరులధనంబును హరియించు నిర్భాగ్యుఁ
డెన్నెన్ని బన్నము లెన్న వలయు
బెలుఁకంటఁ బడనిగరిమ నాధనమును
నేర్పుమయిని నిల్లు సేర్ప వలయు
నిరుగుఁబొరుగువారు నెఱుఁగ కుండఁగఁ దొల్త
గుట్టు పట్టియు దాఁచిపెట్ట వలయు
నరులమాయోపాయ మెఱిఁగి నేమఱకయ
పన్నుగడకు నాఱు పన్న వలయు

తే. గీ. సరళశాంతప్రవర్తనఁ జరుప వలయు
కరవి నేర్పొద్దు నూహలఁ బఱప వలయు
తెఱఁగ నట్టిధైర్యంబున జరుగ వలయు
దొరకుపడని యత్నంబులు నెరప వలయు.

కనఁ గన నీయదృష్టవంతుఁ డట్టులే సంచరించు చున్నట్టులు గట్టిగఁ బొడకట్టెడిని. కావున నితఁడు దాఁచినకనకమునకు నధికారు లేరో యున్నారు. వారి యిట్టిప్రయత్నములు చేయు చున్నారు.

అయ్యో! యితఁ డట్టికట్టిఁడి కాఁడే! కానిచో నీతనిభయమునకును నీదృశప్రవర్తనావస్థకును హేతు వేమి! నే ననుకొనినట్లు వారు చోరులో జారులో పాపులో దోపుడుకాండ్రో యయి యుందురు. అట్టిఁడు లైన నేకాని కాననాంతరమున గిరులమఱుఁగున దాఁచరు. నాపూర్వయజమాను నమానుషవర్తనమునఁ జీల్పరు. ఆభీకరకృత్య

మొక్కఁడే సామాన్యుఁడొనర్చిన నితఁడింతభీతిమైసంచరించఁడు. పెక్కండ్రున్నారు. వారికు ప్రత్యేకపతకములను దొంగిలించిన దోషము లేశము లే దని యీసద్గుణగణుం డాలోచించి యుండు. జారు లైనను చోరు లైనను ప్రాణాపహారు లైనను సరియే నాశరీరమున నూపిరు లుండుదనుక నీతనిప్రాణములు కాపాడక మానను.

ఉ. మానితవృత్తి నిల్పి యభిమానముతోడుత వృద్ధిఁ గాంచుచున్
ప్రాణము మానమున్ నిలిపి భవ్యమృదూక్తులు వెల్లడింపుచున్
మానక ప్రోచు చుండుయజమానునియాపదఁ బాప కుండునా
హీనకృతఘ్నభృత్యజన మే లోకో! చచ్చిన మేలు కా దోకో!

పశువులే తమనిజయజమానునికొఱకు ససువు లర్పింపు చుండ నరులు తొఱఁగనిచో నరపశువు లనుటకుం దగుదురే యీద్విపాదకృతఘ్నభృత్యజీవులు? తడవు మసలరాదు. యిల్లింటివిధమునసే నే నీయిరుగుఁ బొరుగింటితలుపుమూలల నిట్టి యెట్టుగరు లిడియెద.

(నిష్క్రమించును.)



పంచమాంకము—ద్వితీయరంగము.



[ప్రదేశము: గిరిప్రాంతము.

ప్రవేశము: మైరావణాది 39గురు చోరులును.]

మైరా—రక్తాస్యా! కరాళదంష్ట్రా! మారీచునవలెనే ప్రతిజ్ఞ యొనర్చి మనకు శత్రుగ్రహమును గనఁ బఱపఁ జాలనియీదీర్ఘహస్తు వానివలెనే తలఁ దీయ నాముదల.

దీర్ఘ—(కంట నీ రిడుచు) హా! దయ్యమా! మారీసునావు సూసననే నీపని కెందు కొప్పుకోవాలి ? ఇంతకు అక న్నెపిల్లే కారనం.

రక్తా—నా పిం పలంరా యెట్టోడా! నడు నడు. నీ కిర్యాల్తో సరి. నీతో యెంతో జట్టుగా ఫ్రండినోల్లమే నీకంటూ తెగయ్యాల్నొచ్చింది. (అని కంట నీ రిడుచు దీర్ఘజిహ్వుఁ దీసికొనిపోవురు)

మైరా—అయ్యో! నిష్కారణము మారీచదీర్ఘజిహ్వ లీమాయా మోహాకసుల నోపాటింప లేక మ్రుందిరి. ఎందతి నిట్లు మ్రిందించుట! వారియవసానమునఁ బర్యవసాన మేమి! కార్యానుకూలముగ సూచరించుట మంచిది. అయ్యో! నలుబదిమంది బందెపోటుగాండ్రిలో నిరువురు తఱఁగిరి ప్రయోజనము లేకయే.

(31) అనుబంధము.

వకీ—ఇట్లుగా నెన్నాళ్ళు చింతిస్తే యే మగుద్ది దొరా! యేదో దానికి దగినెత్తు యెత్తాల గాని

చోరు—దొరా! మనపట్టు వదలఁ గూడదు.

మైరా—హో! హో! (అని సగర్వముగ) లెంకలారా! నాయుద్యమము నుజ్జగింతునే! కల్ల! కల్ల! కంఠమునఁ బ్రాణము లుండ వలెంగాక

వా. మీపాప్రాణంబులు పోవఁగాక—

చోరు—(నెత్తులు నోళ్ళు మొత్తుకొనుచు) అయ్యో! అయ్యో!

మైరా— పగరం బీఁచం బడంగింప నా
నాప్రాణంబును బోవుఁ గాక—

చోరు—నారాయణ! నారాయణ! అలా గనొద్దు సామీ! సామీ!

మైరా— పగరణ నాశంబు చేయంగ నా
నీప్రచ్ఛన్నము వారికో మనకో యంతే కాని ద్వంద్వంబుగా
నేప్రాపుణ గనకే భయంకరము నై యుం డుండఁగా రాదు సూ.

ఉమ్మడిగొట్టి పుచ్చి చచ్చు. భూమిని మన మయిన నుండ వలె వా రయిన నుండ వలె. ఎవరో యొకరు హాయిగ గుండెపైఁ జేయి వైచికొని సుఖ

ముగ ననుభవింప వలయును. దురదృష్టవంతునకు రాదు. అదృష్టవంతునకుఁ బోదు.

సీ. మనయదృష్టము బాగుగను నున్న దుష్టార్జ
నమె యైనఁ బెరుఁగును నయముగాను
మనదురదృష్టము మనలఁ బీడించినఁ
గష్టార్జనమె యైనఁ గడ నిలువదు
తన కనుకూలుఁడై దైవ ముండినఁ గాని
యేదియు సమకూడ దింత యైన
మన యోర్పు మన నేర్పు మనబుద్ధి మనసుద్ధి
దశ తొలఁగు నెడ వ్యర్థంబు కాదె
తే. గీ. నేనె యార్జించినా నని నీల్గువాఁడు
నోరు తెఱచు నేమి ధనము పాఱునెడల
నట్టులే మనము నిలువఁ బెట్టనైన
గట్టిపట్టు పట్టనివాఁడు కలఁడె యిలను.

ఏది యైనఁ గాల మనుకూలముగా నుండుపర్యంతమె. ఇదివరకుఁ గల శక్తియుక్తులు నేఁడు మనలో లేవే? కలవు. కాని దైవమునూతము మనలో నేఁడు లేఁడు. కావుననే కాలము ప్రతికూలింపు చున్నది. అస మానసంచకు లను పేరుఁ గాంచినమారీచదీర్ఘజిహ్వులపంచత్వమునకు దైవప్రాతికూల్యమె కదా కారణము! పెఱలకొఱకుఁ బెరలు కూడఁ బెట్టునట్టులు మన మీకనకమును గూడఁ బెట్టితిమి. అతఁ డెవ్వఁడో యదృష్టవంతుఁడు: మనము దురదృష్టవంతులము.

తే. గీ. అకట! యార్జించువాఁ డొకఁ డనుభవించు
వాఁడు మఱియొకఁడును గానఁ బాదుఁ గాచి
యుండు దృష్టివిగ్రహ మన నోపు ననుభ
వింపనిగడనకానిని బృథ్విమీఁద.

చోరు—ఏలికా! నేము వొలసినపని ?

మైరా—నా కొక్కడిన్యోపాయము వొడము చున్నది.

చోరు—తొరగా సెప్పు దొరా అదేదో!

మైరా—చోరులారా ! నేను వినయంధరుని గొని చని మనపరిపంథి గృహాముస్న బాధుగ నాసవాలు పట్టి వచ్చితిని.

చోరు—మామంచిపని సేశారు సామీ!

మైరా—ఇక నే నొక తైలవిక్రియుని వేసము వేసి మిమ్ములముప్పది యేడుగురను ముప్పదియేడుపెద్దసిద్దెలలో భద్రపఱచి వాని కేవిధ మైనయనుమానమును బొడమ కుండ మఱియొక పెద్ద సిద్దెను నూనె నించియుంచి యది వానికిఁ జూపి నా కేదో యభ్యంతరము వచ్చినట్లును నాఁ డేయి నాయింట నుంటకు సమ్మతి యి మ్మనునట్లును నొక్కి వక్కాణించి యొప్పించెద. అనంతరము కావింప వలసినవిధానము సంగు ముందు వినుతు సత్వరము మనము సాసిద్ధులము కావలయు రండు.

చోరు—మామంచుపాయం దొరా! (అంద అరుగుచు.)

(**32**) అనుబంధము.



పంచమాంకము:—తృతీయరంగము.



[ప్రదేశము: చావడి. ప్రవేశము: గుణవతి, అదృష్టవంతుఁడు.]

గుణవతి— (**33**) అనుబంధము.

అదృ—ఇ దేమి! గుణవతీ ! యిట్లు పరిసంగింపు చున్నావు!

గుణ—దేవా ! ఏ మున్నది ! నన్నుఁ బోలినయే లోక మున్నది యను కొను చున్నమీయమాయికత్వము నన్ను నాందోళనమున

మునుమ చున్నది. బాదుగులు కానిండు బాదిపోటుగాండ్రు
కానిం డీదినమ్ముల నెవ్వరిని నమ్మరాదు. వంచకులు, కుమతులు,
స్వార్థపరాయణులు.

అదృ—నీయభిప్రాయము పూర్ణముగ వెల్లడింపుము?

గుణ—ఆర్యా! క్షమింపుఁడు. తమగుట్టుమట్టు లీగుణవతికడ నా!

ఉ. నాకడ దాఁచ నేల సుగుణప్రవరా! తమ రున్నరీతి నే
నే కనిపెట్టు చుంటి: మఱి యిక్కడఁ గానఁగ నౌమహాపదల్
తేకువమై మరల్చుచుఁ బ్రతిక్షణమున్ గను జాగరూకతన్
మీకడ నుంటిఁ దెల్పమి క్షమింపుఁడు

అదృ— తెల్పగరాదె యిప్పుడున్.

గుణ—వచింప కేమి స్వామీ! మనమురదృష్టవంతాదుల మరణానంత
రము నుండియు నన్నియు వింతలే చూపట్టెడిని. దాన నేరో
యపకారులు బలవద్విరోధులు కలరని నేను మిక్కిలిభద్రముగ
మెలఁగుచుంటిని. మనయింటితలుపులపైఁ దొలుతఁ దెల్లనిగుర్తు
లొకనాఁ డదృష్టవశమున నాదృష్టిఁ బడ ననుమానించి
ప్రక్కయిండ్లతలుపులపై నట్టిగుర్తులె పెట్టితి. మఱునాఁ డెఱ్ఱని
గుర్తులు తలుపులమూలల నగుపడ నట్టులె మరలఁ జేసితి.
ప్రతిదినముఁ బలుమాఱు పలువు రిట్టటు పరీక్షావిధానేక్షణ
ముల మనయావాసమార్గము ననుసరించుటయుఁ గనిపెట్టు
చుంటిని. ఏవంచనమునఁ బంచత్వము నొందుదుమో యను
భయమున నేమఱక సంచరించెద.

అదృ—ఏమీ! వారేమఱి యుండ లేదే! మనలఁ గనిపెట్టి గట్టిపట్టుఁదల
తోనే యున్నారు కాఁ బోలు!

గుణ—వా రెవ్వరో నే నెఱుఁగ నగునా దేవా!

అదృ—నీకు నెఱింగింప రాని దేది గుణవతీ! నాయొద్ద నున్ననాణె

ములు నాయన్నయు వదినెయు నీవును జూచియే యున్నారు.
అవి గిరిమధ్య మొకచో నున్న నిధిలోనివి.

ఉ. చోరులు దాచుకొన్న నిధి సున్నది: యిస్సుగ దానిమర్మమున్
నేరిచి సంగ్రహించితిని నే: నదియే సుమి యన్న చావుగాఁ
గారణ మయ్యె: వాని మృతకాయవిభాగములన్ యథావిధిన్
గూరిచి వెన్కఁ బాతమె నిగూఢముగా

గుణ—మును సంశయించితిన్

అదృ—నాఁట నుండియు నేను మెలకువమై దిరుగు చుంటి. నాకుఁ
దోడుగా నిన్ను భగవంతుఁడొసఁగుట నాయదృష్టము. గుణ
వతీ! నీకృతజ్ఞతను నేను మఱవ. నిన్నుం గన్నులం గప్పుకొనుచు
నరచేతిలోని వెన్నయప్పమురీతిఁ గన్నకూఁతుభాతిం గనుం
గొనెదను.

ఉ. సారమతిన్ కృతజ్ఞతను సాఁకుచు నుంటివి నాదుప్రాణ మిం
కే రధికుల్ తలంపఁగను నీయుపకారమందున

గుణ—ఈశరీర మో

వ్వారిపదార్థయుక్తమునఁ బ్రాణములన్ ధరియించి యుండెనో
వారితనూభరంబునకె వాడని యో నిఁక నేల కాల్పనే?

ఉ. కోరిక దీని ముక్కలుగఁ గోసి యొసంగు మటన్న నిచ్చెదన్
జేరు మటన్న నగ్నిఁ జొరఁ జేరుదు నింతయు సంశయింపకే:
యారయ నాకు నాయసువులా యధికారబులు మీవియా యికన్

అదృ—నీరమతీ! భవద్వినయధీవిభవంబు ప్రశంసనీయ మా.

గుణ—ప్రభూ! నన్నుఁ బిలిచినకారణ మేమియో తెలుప వేఁడుదు.

అదృ—గుణవతీ! నేఁడు మనయింటికి కొక్కతైలవర్తకుఁ డతిథిగా వచ్చి
యున్నాఁడు. ముప్పదియెనిమిది పెద్దసిద్దెలనూనెతోఁ గనుచీఁకటి
సమయమున కీయూరఁ జేరినయాతఁ డిప్పుడు పొరుగూరికిఁబో

వెఱచి మనమఱుఁగుఁ జొచ్చినాఁడు. వాని కీపూఁట కేఁడుయు వల దఁట. తెల్లవాఱునప్పుడు ప్రయాణమును సాగించు నఁట. వేకువ వేళనైన వాని సత్కరింపకున్న మర్యాద కాదు: కావున నీ. వీరాత్రి మెలకువనై వానిపఁక్కఁ జక్కఁ బెట్ట వలయును.

గుణ—చిత్తము. తమయాజ్ఞ శిరసావహింతు (ఇరువురు నరుగుదురు.)



## పంచమాంకము:—తురీయరంగము.



[ప్రదేశము: అదృష్టవంతునియింటిదొడ్డి. ప్రవేశము: మైరావణుఁడు.]

(దొడ్డిలో వరుసగ నున్నయొక్కొక్కసిద్దెయొద్దకు వెళ్ళి యనుమానమున నటు నిటుఁ గొంత పరీక్షించి) అనుచరులారా! అందఱు క్షేమమేకదా! గాలి బాగుగాఁ దూరు చున్నదా! ఉక్కిరిబిక్కిరి గా కున్నారా! ఈరాత్రియే మన మొనగుప నగునుత్కృష్టకార్యము. మన మిప్పు డనుకొనినస్థానమున నున్నాము. మెలకువను గలిగి యాయుధహస్తులై కోరినవెంటనే విచ్చుకత్తులతో వెలికి వచ్చుటకు సిద్ధముగ నుండుఁడు. నే నేయనుమానమును బొందనియదృష్టవంతునొద్ద నతఁడు గాఢనిద్రాపరవశుఁ డగునంతదనుకను నిద్రఁబోవునట్లు నటించి యర్ధరాత్రి నిశ్శబ్దముగ వచ్చి మీసిద్దెలపైఁ జిన్నతాళ్ళు విసరెద. ఆశబ్దములకు మీరెల్లరు వెలువడి వడివడి సందడి లేకుండ నాకడకుఁ జనుదెంచిన మనమనుకొనినదియంతయు నిరాఘాటముగ నెరవేరును. వెనుక మనము క్షేమముగ మనుదుము. ఇదియ యదను. ఇప్పుడు వానియింట నుంట మనమును, గనుమఱఁగి యాయుధహస్తులమై ప్రచ్ఛన్నవేషముల నున్నమిమ్ములను నన్నుఁ దనగృహములోనికి రా నిచ్చి యుండుట నతఁడును, నెండ్లొరులచేఁ జిక్కి యున్నాము. జయ మెవరికో యెఱుఁగ మయినను మసల నతఁడు కనిపెట్టకుండుట మనమే

సంకల్పసిద్ధుల మగుదు మని నానమ్మకమ్ము. జాగ్రత్త! మెలకువ మెల
కువ! నే నరుగు చున్నాను. ఇక్కడ నిదియ తుది చూపు. (చనును)

గుణ — (ప్రవేశించుచు) అయ్యో! తెల తెలవారు నప్పటికి నీరాహార
ములు సిద్ధ మొనర్పు మని యజమానునాజ్ఞ. ఇప్పటికె యాలస్య
మైనది. అర్ధరాత్రి సమీపింప నున్నది. ఇంటిపను లెల్లఁ
జక్కఁ బెట్ట నిప్పటికి తీఱిక యయినది. నిదురఁ బోవుచు నా
త్వరితముఁ దిరుగ మేలుకాంచుట కష్ట మేమో యని నవరస
భక్ష్యభోజనాదుల నీరాహారముల సరిపఱచు చున్నానా వేగిర
పాటు నణఁప నాయాందోళనముఁ బెరుప దీప మాఱిపోయినది
వంటయింట నూనె లేదు. క్రొవ్వొత్తుల నడుగుటకు మెలకువమై
నున్నాఁడేమో యనుకొని చనికన యజమానుఁడు నిద్ర నిప్పు
డిప్పుడే పొందు చున్నాఁడు. లేపుట భావ్యము కాదు. ఏమియుఁ
దోఁచదు (ఆలోచించి) ఆఁ — జ్ఞప్తి వచ్చినది. తైలవర్తకుఁడు కొని
వచ్చిన పెద్దసిద్దెల నిండుగ నూనె యున్నది కదా! నా వలసిన
నూనెఁ గార్యావసరముఁ బట్టి యిప్పుడు తీసికొని యుదయము
నను వానికి వృత్తాంతమంతయు నాంతముగ నెఱిఁగించి దాని
కగుమూల్యము నిప్పించెద. (ఒక సిద్దె యొద్దకుఁ జని మూఁతఁ
దీయుచుండ లోపలనుండి ఆ! క్షిసర లే దేమి సామీ!
యే లయిందా? యన గుణవతి బెదరి తొలఁగి నిర్ఘాతపడి
యాలోచించి) హృదయమా! ధైర్యము! ధైర్యము! కర్తవ్యము.
(సిద్దె యొద్దకుఁ జని మెల్లన) లేదు. మీరు మెలకువఁ గలిగి
యున్నారో నిద్రిస్తున్నారో తెలియవచ్చితి. (ముప్పదియేడు సిద్దెల
యొద్ద నట్లే యొనరిచి ముప్పదియెనిమిదవ సిద్దె తెఱచి) అయ్యో!
యెట్టి ముస్తరాక్షస! ఒడల దడమోహమెడిని. ఈ యొక్క సిద్దె నే నా
నూనె యున్నది? కానిమ్ము; దీనిఁ గొంతఁ బ్రవ్రిథమమునఁ దీస

కొని చని దీపమును వెలిగించి వెంటనే వచ్చి వీరికిఁ దగుశాస్తి యొనర్చెద. అన్నా ! యెంతమోసము (నూనె ముంచికొని)

ఉ. దండిగ నాగులన్ బఱఁగ దగ్గఱఁ జేర్చి యమాయికంబునన్
గుండియమీఁదఁ జేయి నిడి కూర్కను జెందుచు నుంటి వయ్యయో!
దుండగు లీరు సిద్దెలను దూఱియ యుండుటఁ గ్వాని చెంత ను
ద్దండుఁడు తైలవర్తకువిధంబునఁ బాడుట కాని నేరకే.

(చని కటారిత్రోఁబ్రివేశించి) వీరికలస్థితి నెఱింగించినయోదయామయా! నీవే త్రోఁడు. (అని యొక్కొక్కసిద్దె తెఱచి యందుఁగలవానిఁబొడుచుచును)

భళి! భళి! వంచకులకు వంచనయ మంచిది. ఆహా ! హేతువులేనిదే తీతువు కూయునే! ఇందునకె దీపమాఱుటయు నూనె లేమియు సంభవించినది. చెఱుపకురా చెడియెద వనునట్లు చంపఁ దలంచి కొంపకు వచ్చి చచ్చిరి. తుందుడుకువారల కెందు నింతయ.

కట్టా! చెంత నిద్రాముద్రితుండై యుండినయదృష్టవంతున కేదే నపకృతి యొనరుపఁడు కదా యామాయావి? అంతయే జరిగిన వాని యంతము నేను జరిపి నేను నంత మొందెద. కాదు కాదు. అట్లైనన్నటికిని గాదు. అట్లే యాతఁడు చేయ నెంచిన వీరి వెలుపల నేలనిలుపు. ఏదినూ మాయ చేయం దలంచియే యిందు వీరి నుంచినాఁడు. నే నీవంట యింటికిటికీసందున నుండి యిచ్చటిసంగతి నంతయు దొంగతనముగఁ గనుఁగొనుచుందును. దొంగను దొంగయే పట్ట వలయును. సమయానుకూలముగ నీయాయుధము నాయొద్దనే యుండ నగును. (అరుగుచు)

## (34) అనుబంధము.

(అంత లోపలనుండి చిన్నతాళ్లను విసరిన యనంతరము రెండవ ప్రక్కనుండి మైరావణుఁడు కోపమున వచ్చి) వీరు వచ్చి యేమిప్రయోజనము? చచ్చిన బాగగు. మొద్దునిద్దుర మునుఁగుటకన్నఁ బెద్దనిద్దుర నే మునిఁగిన వీరికై విచారింపక నే నొక్కఁడనే వాని నుక్కడంచి చని

యుండు. ఛీ! వీరికి లవంబును జ్ఞానంబు లేదు. ఎన్నిత్రాళ్ళ నెంత విసరినఁ గార్యహీన మయ్యె. వీరే లేచి వచ్చిన నీసరికి నన్నతిథిగా స్వీకరించిననా యరివి జన్మునింటి కతిథిని జేసి యుండనే! ఈపీనుఁగుల నొక్కొక్కఁ దన్ను తన్ని వెలుపల కీడ్వ వలయునే కాని మర్యాదగా లేవరు. ధనియములజాతి చెప్పుదెబ్బ లేనిదే లేచునే! (అరుగఁబోయి) అయ్యో! కోపతాపములఁ దన్నుమనా పెద్దచప్పుడగును. దాన హాని రావచ్చును. నాకినుకనిప్పటికిఁ జాలించి సఫలీకృతుఁడ నయి యడవి కేగినయనంతరము వీరియేమఱుపాటునకుఁ దగుప్రాయశ్చిత్త మొనర్తును. (సిద్దెల నొక్కొక్కటిగ దెఱచి) హా! హా! యిది యేమిది యేమి! అయ్యో! అయ్యో! వీరినెల్లర నేమాఱుతురు పఱిమారిచిరో! నామోసము బయలుపడినది. నా తంత్రము పరతంత్ర మైనది. నాచేసినదంతయు వృథాయాస మైనది. వీరిని మన్నిగొన్నవారు నన్నును గనిపెట్టుచుండక మానరు. సత్వరము దొడ్డిగోడ దాఁటి ధాటిగఁ గాళ్లకు బుద్ధి చెప్పినఁగాని నామనికియు ననిత్యమే (అంత కిటికీచప్పుడగును) హా! (అని పరుగిడి పడి గాయమయి రక్తమొలుకు చున్న మొగముతోఁ జనును)

గుణ—[ప్రవేశించి] ఓరీ! దుర్మార్గ! నీకుఁ బతన మెప్పటికైనఁ దప్పదు ఈనీవర్తమానపతనమే భావిసూచన. నీలలాటచిహ్నము నేను బాగుగా గుర్తించినాను. మాయమాయికత్వమె మమ్మెప్పటికిఁ గాపాడుఁ గాక! ఏమి వీనిసాహసము! కేసరి గలగుహానే నిర్భయముగఁ జొచ్చెను! అబల నగుట ధృతి మతి నిలిచినది కాదు కాని వానిదగుమృతియుఁ గాంచ వలసినదే. చేయి దాఁటిన వెనుక యోచింప నే మగును? మ మ్మీయాపద నుండి తప్పించిన యాసర్వసాక్షి స్మరించి యీయుదంత మాద్యంతము పెందలకడనే యజమానున కెఱింగింతు.

(35) అనుబంధము.

(నిష్క్రమించును.)



శ్రీ

సంగీత

# అదృష్టవిజయనాటకము.

## షష్ఠాంకము:—ప్రథమరంగము.

[ప్రదేశము: అదృష్టవంతుని యిల్లు ప్రవేశము: అదృష్టవంతుఁడు, గుణవతి]

(36) అనుబంధము.

గుణ—దేవా! దైవము ప్రతికూలించి యుండిన మనము తెల్లవాఱినవో యుంటిమి.

అదృ—అది యేమి గుణవతీ! (నిరీక్షించి) ఏఁడీ! యీ యెపఁ బరుండిన తైలవ్యాపారి యేఁడీ?

గుణ—ఏమో! అబలను నే నేమి వాని నదలించి బెదరించితినా పలా యనుఁ డగుటకు!

అదృ—ఏమి! అతఁడు పరుగిడినాఁడే! కారణ మేమి?

గుణ—కారణము సాంతయులు కే.

శా. స్వామీ! పామును జెంతఁ జేర్చుకొని యవ్యాజానురాగంబునన్
క్షేమప్రక్రియఁ జూచి యుక్తవిధులన్ స్నేహంబు వాటించినన్
భీమాకారము లేపి వీలుఁ గని దుర్వృత్తిప్రకారంబునన్
గామక్రోధము తీరఁగా నిధనమున్ గావింపఁ దాఁ జూడదే?
విషజీవులకుఁ దా వొసఁగ నగునే?

అదృ—గుణవతీ! అతఁడు వచ్చునఁడే? పొఱఁబడవుకదా? ప్రమాదము వచ్చును. అతిథ్యభ్యాగతుల నాందోళనము పఱచువాఁడనునాడికోలునకు లోనగుదును నేను. తుందుడుకునం దేనిం దలపెట్ట రాదు. ఇప్పట్టున మనకు జగమంతయు దోషభూయిష్ఠముగను మోసకాండ్రతో నిండినదిగను గనుపించు.

గుణ—ఇంకను భ్రమ యేనా దేవా! మనదినములు బాగుగనున్నవి లే కున్న మన్నిగొనఁ బడియే యుందుము.

సీ. ఊరు పే రెఱుఁగనియుక్కివు నెవనినో
యిక్కకుఁ జేర్చుట యొక్కతప్పు
చేర్చిన వాని నేచెంతనో యుంచక
యిక్కయంతయుఁ జూపు టొక్కతప్పు
చూపిన వానిపైఁ జూపిడి యుండక
పక్కఁ బక్క యొసంగు టొక్కతప్పు
పక్క నిడియు వానివర్తనం బరయక
యొడ లెఱుఁగక పండు టొక్కతప్పు

తే. గీ. కట్టు! రజ్జుసర్పభ్రాంతిఁ గడప నలసి
నట్టి యిక్కాలమునను మీ రిట్లు లేమ
ఆయె యమాయికత్వము నతిప్రేమఁ బఱప
మనమనికియు యనిశ్చయ మనఁగ నొప్పు

మీకు నమ్మక మ్మెక్కుడు. తుంటరు లెన్నికొంటెతనములు సన్ను మరో యెఱుఁగరు. వారిపలుకులు నిక్కముగఁ దలఁచెదరు. నీతిజాతిహీనులు కల్ల లాడ వెనుకాడెదరా! తల్లిదండ్రిప్రాపులు నెన్నక యొట్టులుపెట్టు కొనుటాలామూలకు లేమి కావలెను! పెక్కండ్రు విరోధులు కలరని యెఱిఁగియుఁ బ్రతిక్రియ నాలోచింపక సంశయింపక భగవంతునె పాటింతురు. ముందువెనుకల మేలుకీడుల గృతజ్ఞతాకృతఘ్నతలఁ దెలి

యునియువజనానందసంఘసమవర్తను లగుదురే! మీావలెనే లోక మున్నదా! ఎట్టులైనఁ బడఁగొట్టఁ గట్టిపట్టు పట్టియున్నవా రెందఱో కలరు. అందఱు సత్యరాజులా! నేతిబీరకాయ లాపేరులు.

అదృ—గుణవతీ! ఎవఁడేకీడు మన కొనరుపఁ దలంచినను, దైవము, మన మొరుల కేకీడును నొనరుపము కనుక, కొనసాగించునా! ఆహా! యేమి బొంకులు

మ. పొరుగూరే నీకుఁ బోనఁ జాలఁ దమి పెంపున్ జూడవే మొక్కఁడన్
సర కెన్నంగను జాలఁగాఁ గలదు విస్తారోపచారాం బిఁకన్
జరుపన్ గా నగుఁ జెల్ల వాఱుదనకన్ సంతోషణం బీయవే
మఱుఁగున్ జూపవె యంచు వేఁడ నటు సమ్మానించి తా విచ్చితిన్

ఏమో యెవ్వరికైన నప్పట్టున నైన మొక్కఁడప్పు పెట్టి దిగువిమను స్థితి సంభవింపక పోదని మాచికై సంచరించు నేను లోకోపకారార్థ సాదృశముగా నాతిథ్య మొసంగితి. ఇది దోసంగే యయ్యె.

గుణ—దేవా? ఇఁక మీా రెన్నఁటికని, లో నపుంగిపు, నాడంబపు కుందు రని నాయాశయము.

అదృ—గుణవతీ! అట్లొనర్చుట యుక్తము కాదు. లేఁడా వేంకటగోపాలుఁడు మనవాంఛితసత్కార్యములు దొంగిలినంత మాత్రమున వారికే కార్యమును గాదు. నూాయూవ్యులు నన్ను కిన్నుగిప్పిన నది వారి యొక్క యంత్యమునకే యని దృఢముగ నమ్మము. ఆపదలు వచ్చునని కదా నీతలంపులు. ఏయాపద లయిన ఘనతరులకే కాని కుజనులకు రావు. చెడుబంగారము చెంత నుండినఁ గాని మాచి బంగారమువన్నె బయలుపడదు. కాకిబంగారము బంగారమేనా! పుత్తడిఁ బుటము పెట్టిన వన్నె వచ్చును గాని యిత్తడిఁ బెట్టిన హెచ్చునే! చందనమ్ము నఱుఁగఁ దీసిన సౌరభ్యమ్ములఁ జిమ్ముఁ గాని తుమ్మకొమ్మ నఱుఁగఁ దీసినఁ జిమ్మునే! రత్నము సానఁ

బట్టినఁ గళలఁ విలసిలుఁ గాని త్రాయి రాచిన వెలుఁగునే! బన్న మునఁ జిక్కినఁ గాని వన్నె కెక్కునే! ఇంతమాత్రమున మన పుణ్యకార్యములు వర్జింతుమా!

కం. అడలెడువానిం గడుఁగడు
పెడ కెడువానిన్ మఱిమఱి బడలెడువానిం
గడగండ్లఁ బడెడువానిన్
వడి సాఁకనిజన్మ మేల వ్యర్థము కాదే!

కం. ఉన్నంతలోన దీనుల
కన్నాదుల నిడుచుఁ దగుసహాయ మొసఁగుచున్
బున్నెంబు గడన సేయని
యన్నరుజన్మంబు నేల వ్యర్థము కాదే!

-ఈమాటల కేమి గుణవతీ! నీమాట లేమి? అతని నెట్లు వంచకునిగ నిరూపించితివి?

గుణ——రాత్రి దీప మాఱి చమురు లేకపోయినది. ఉదయమున సమాధానము చెప్పి మూల్య మిప్పించ వచ్చుఁ గదా యనుకొని కార్యావసరమును బట్టి పెద్దసిద్దెలయొద్దకు వెడలితిని; బోయి వానిలో నొకదానిమూఁతఁ దీయ లో నుండి వెస నెస గుసగుసలు వెడలుట విని కసిమసిలక స్థైర్యధైర్యసంభ్రమాశ్చర్యములఁ దగుసమాధాన మిడి యన్నియు నట్లే పరీక్షించి మూఁత లిడి ముప్పదియొనిమిదవసిద్దె నొక్కటను గలనూనెఁ దీసికొని సువారాగారమునకు వెడలి దీపము వెలిఁగించి కటారితోఁ దిరుగ వానియొద్ద కరిగి కుట్ర నియేసుసిద్దెల నాయుధములతో సిద్దెల వలె మనయాయువులు గడ ముట్టింప సిద్ధముగ నున్న ముప్పది యేడుగురుదొంగలం గిక్కుఅమన కుండ——దొంగను దేలు

కుట్టినట్లులు - కడముట్టించి సంగతి నెఱుంగం గిటికీకడc బొంచి కాంచు చుంటి. అర్థరాత్రి యగుట నంతట మీాచెంత నిద్రి నటించినవంచకుcడు వెలికి వచ్చి తొలుత వానిపై త్రాళ్ళు విస రియు ఫలితము గానక వాని డాసి తనయనుచరులయంతము నం తయుం గనుంగొని చింతాక్రాంతుcడై గా మండి నేను ధ్వని యొనరించితిని. దాని విని పరుగిడcబోయి బోరగిలcబడి లేచి నెదుటc దగిలినదెబ్బ నయిన సరకుగొనక తనసరకు గొనక గోడ దాcటి ధాటిగాc బోయినాcడు.

అదృ—ఆc-ఏమి ! ఎంతతంత్రము ! ఆముష్పదియేకుసిద్దెలను నాయుధ ధారు లున్నారా ! సత్వరము పోయి మనపెద్దదొడ్డిలో వారి నెల్లర నతినిగూఢముగ లోcతుగc బాతింప వలయును. ఆహా ! గుణవతీ ! దైవము నిన్ను నాకుc బ్రాణాధారముగc దనుత్రా ణముగ నొసcగె.

(37) అనుబంధము.

అదృ—రమ్ము సత్వరమ్ము. (అరుగుదురు)

---

షష్ఠాంకము:—ద్వితీయరంగము.

[ప్రదేశము: వనము ప్రవేశము: మైరావణుcడు]

(38) అనుబంధము.

అయ్యో ! దయ్యమా ! దిక్కు మాలిన పక్కి నొనర్చితివా ! నా తెక్కల నొక్కసారియే తుంచి వైచితివా ! నాబల ముడిగించి తివా! తా నొకటి తలcప దైవమొకటి తలcచు ననుట తథ్య మొనర్చి తివా ! అక్కటా ! అన్యాయార్జనలకు నిట్టివే యిక్కటు లని రూఢిప

రచితివా ! అయ్యయ్యో! యెవరెవరియసు రెట్టిదియో! తీర్థవాసులను దివ్యస్థలములను యాత్రాపరులను దోఁచితిమి. ఎన్నెన్నో కుటుంబ ముల నెన్నెన్నో బన్నములను బెట్టి ధ్వంస మొనర్చితిమి. ఆయు సురే నేఁడు మమ్ము కట్టి కుడుపుటయే గాక మట్టుపెట్టు చున్నయది. అకాలమరణమున నాకాలునిపాలికిఁ దోలు చున్నది.

సీ. నీడపోలిక సదా యేడ కేగిన నన్ను
వెన్నాడుననుచరుల్ వీడినారు
చేదోడు వాదోడు గాఁ దిరుగాడెడి
సైదోడు లింతలో సమసినారు
గర్భనిర్భేద మహాకార్యంబు నొనరించు
భటులు నాయండను బాసినారు
ధైర్యంబు స్థైర్యంబు వీర్యంబుఁ బురికొల్పు
ప్రోత్సాహకులు వీడి పోయినారు
తే. గీ. విక్రమాంధ్యులు మరి వరవీరచరితు
లకట! దారుణమరణము నందినారు
నేను పన్నినమాయావిధాన హేతు
వునను, బలవన్మరణమును బొందినారు.

హా దైవమా ! యిఁక నేను బ్రిదికియు నేమి ప్రయోజనము.

సీ. కుల నేసినయంత నెంతో వింతగ వచ్చి
చుట్టు ముట్టాప్తులు చూడ లేరు
చేసినయాజ్ఞను, జిత్త మంచును జని,
నెరపునాజ్ఞాబద్ధు లరయ లేరు
కొల్లగొట్టుడ మన్నఁ గోయని చెలరేఁగు
నుత్సాహకరులు నా కొనర లేరు

తీఱిక వేళలఁ దీరుగాఁ గూర్చుండి
సౌరుగా భాషించువారు లేరు
తే. గీ. అశ్వమే నెక్కి యరిగెడునంతఁ జెంత
నీవ లావలఁ జేరువా రేరు లేరు
గారవంబున సాదరిఁ జేరువారు
లేరు ధారణి నిఁక నేరు లేరు లేరు.

అయ్యో! చేతులారఁ గొనిపోయి, పులివాతఁ బెట్టినట్టులు, మిమ్ము వానిచేతఁ బెట్టితి. హా! హా! పావకాశమ్మగ మిమ్ము చూచి యేడ్చుటకును సందు చిక్కినది కాదు. సహచరులారా! ద్రోహ మొనర్చితి. నాప్రాణమునే నేను కాపాడుకొన్నవాఁడ. నన్ను ధనార్జనఁ జేసిన మిమ్ము నిర్జీవుల నొనర్చి వర్జించి వచ్చితి. నాకన్న ఖలుఁడు కలఁడే! ప్రచ్ఛన్నవేషులారా! మీరు ప్రచ్ఛన్నముగ నే మున్నుఁ గలిసివారా? నాకును మరణమే శరణముగఁ గనిపించు చున్నది. హా! నాయుమణి వార్త! కట్టా! నానోస లెంతగాఁ గొట్టుకొనిపోయినది. నేఁటికి నాకీ మచ్చ వచ్చినది; యీ మచ్చతోన నేను చచ్చెద.

చ. అకట! విషాదమె శోభనమై తెగిదిమ్మ ఘటింపుచుండె నా
కొకటియుఁ దోఁచకుండె సురి యోపిక మాపుచుండె నిఁక నా
చకచక లెల్ల నాఁడె ధృతి స్వాంతము వీడుచు నుండె చావు పై
వికమిఁకఁ దప్ప దంచు నెద వేగిరపాటు వచింపుచుండెగా

ఇక్కడఁ జచ్చుటకన్న నక్కడనే చచ్చెద. ఏమో మఱియుకునో విజయమున మగుడుకునో యెవరికెఱుక! ఏయుపాయమున నేను వాని మగుడఁ గలిసికొందు? (కొంత యాలోచించి) ఆఁహా! హరిసంగ మధ్యమున నిన్నరేయి నాతఁడు నాతో, తనతనయుఁడు నెలఁ గల వలువలు వస్తువులు నమ్ముదుకొనమ్ము పెట్టినట్టులు, వచించినాఁడు. అమూల్యము లగువస్త్రాదులఁ గొని చని నేను వాని వంచించెద. ఉపా

యాంతరము గత్యంతరము లేదు. "ఓతిలోత్తమా!" (అనునంత తలుపు లు తెఱువ లోని కేగి వచ్చి) ఓస్వర్ణపూర్ణగహ్వరమా ! నీకు నాకు నేఁటి ఋణము తీఱినది. నీ వదృష్టవంతు నే చెట్టపట్టుదు వని నాగట్టినమ్మకమ్ము. నే సుకదృష్టవంతుఁడ నని తలఁకెద. నాయదృష్టదినములు తొలఁగినవి: లేక నేనే విజయుఁడనై మగుడుదునా నీకు బలు లనేకములు. ఆహా ! యిం దున్న పశుపక్షిజడములును నా పేరు విని గడగడ లాడునవి. ఇవియు నిందు నిర్భయముగా నిపుడు సంచరించుట నా మడియుట—హా !

సీ. సురలార ! నరులార ! హరులార ! మైరావ
ణుఁడు పోవుచుండె మీ బెడఁద తీర
హరులార ! కరులార ! కిరులార ! మైరావ
ణుఁడు పోవుచుండె మీ యెడఁద తీర
గిరులార ! ఝరులార ! తరులార ! మైరావ
ణుఁడు పోవుచుండె మీ బెడఁద తీర
పురలార ! విరులార ! తోఁటలార ! మైరావ
ణుఁడు పోవుచుండె మీ బెడఁద తీర

తే. గీ. శుకములార ! తుమ్మెదలార ! పులుఁగుకుబేసులార !
ఖగములార ! చలించు మేఘంబులార !
సరసులార ! వరసరసిజంబులార !
వెనలు మైరావణుండు మీ బెడఁద తీర ! (పోవును)



షష్ఠాంకము:—తృతీయరంగము.

---

[ప్రదేశము: అదృష్టవంతునిగృహము. ప్రవేశము: అదృష్టవంతుఁడు, గుణవంతుఁడు, మైరావణుఁడు మున్నగువారు.]

అదృ— (39) అనుబాధము.

అదృ—వణిగ్వరా తమరాక రాకఁ బోలి నానేత్రచకోరకములకు. నత్యానందము నించుచున్నది. తావకీనపావనపదరేణు పతనమున నాగృహము పావన మయినది.

సీ. నేత్రము లేపూజ నెరవేర్చెనో మిమ్ము
ముద మారఁ గాంచ నంభోజనేత్ర!
శ్రోత్రము లేనోము శోధించెనో మిమ్ము
సారు మీఱ విన శ్రీకారశ్రోత్ర!
గాత్ర మేతపమును గావించెనో మిమ్ము
దగ్గఱి యుండ సౌందర్యగాత్ర!
గాత్ర మేసుకృతినిఁ గడతేర్చెనో మిమ్ము
మరి మరి భాషింప మంజుగాత్ర!

తే. గీ. ఏమి నాపురాకృతపుణ్య మేమి పూజ
యేమి నానేర్చి యున్నవిద్యామహాత్వ
మేమి నాసతీవ్రతసుదీక్షామహిమము
నేమని వినుతు నే మహాస్వామి! నేఁడు.

కుబేరనిభ బేహారీ! యిటు దయచేయుఁడు. (వెనుదిరిగి చనుచుండ)

మైరా—(స్వగతము మొలను చేయి నిడి) వీని నిప్పుడ కడతేర్తునా? వలదు: వలదు. అట్లొనర్చిన నేను వెడలు టెట్లు! వీరందఱు నన్ను చుట్టుముట్టి మట్టుపెట్టరా? పెక్కండ్రొ నొక్కండ నేమిచేయుదు. అదను గనియెదను. (చని ఆసీనుఁడగును.)

అదృ—కుమారా! గుణవంతా!

ఉ. ఎన్నఁడు రాని పెద్ద లిపు డింటికి వచ్చిరి వారిసేవ యె
న్నెన్ని భవంబు లెత్తినను నెంతయు దుర్లభ మౌను నేఁడు నా
కెన్నఁగఁ బర్వ మయ్యెఁ దరియించితి ధన్యుఁడ ధన్యుఁడన్ గదా
కన్నకుమా . . నీవలనఁ గాంచితి నీగురుఁ గాంచుభాగ్యమున్

సత్వరము స్వయముగఁ బరిశుభ్రముగ నుండుపాలు, పంచదార, పండ్లు, తెమ్ము.

మైరా—అయ్యా! నా కిప్పు డేమియు వలదు.

అదృ—మహానీయా! తమ దగుతత్త్వోపదేశమున నాదగుసత్వగుణము ప్రకాశించుఁ గాక! ఏమి తమ దగుదివ్యబోధ! నాసంశయముల నెల్లఁ దొలఁగించినది. నాపాపము పటాపంచ లైనది. నాజన్మము ధన్యము. నానామము సార్థకము.

మ. అరిషడ్వర్గము నంత త్రుంచి విధు లత్యావశ్యతం గాంచి స
ద్గురుసేవన్ బొనరించి సత్వగుణబద్ధుండై సదాచారము
న్నెరలన్ ద్రోయక యాత్మగౌరవము నింతేఁ దప్పకే శాంతిమైన్
బరమాత్మన్ స్మరియింప బొందుదును కైవల్యంబు దేవైక్యమున్.

మైరా—అవును. అదృష్టవంతా!

ఉ. సత్వరజస్తమంబులను సత్వమునే గ్రహియించి ధారణీ
తత్వము బాగుగా నెఱిఁగి దారకుమారగభీరసంసృతిన్
సత్వర మీఁగి యీశు మనసా స్మరియించుచు శాంతిమైని పం
చత్వము నొందుమర్త్యునకు స్వర్గము చేరువఁ జేర నుండదే!

అదృ—(తనలో) ఈతఁ డెంత మొక్కడనో విచారింప ముర్ను విన్నదిగనే తోఁచెడిని. జ్ఞప్తి చాలదు. (ప్రకాశముగా)

చ. పగలును రాత్రియున్ సతముఁ బ్రాకృతతత్వములన్ జరించి నై
జగుణము వీడకే పరులసంపదలన్ హరియింపఁ జూచుమర్

సుగుణా మొకండు లేక యలసూకరముంబలెఁ బొట్ట నింపుచుఁ జా
వగల మనుంగు చండెడిద్విపాదపశుప్రతికృష్టుఁ డే లోకో !

(చక్కఁగా నలంకరించుకొని గుణవతి ప్రవేశించి)

గుణ—(తనలో) ఈతఁడే యగునా కాఁడా ! వేగిరపాటున నేనొగుఁ గల్పించుకొనక బాగుపడ నగు. ఇప్పుడిప్పుడే మానుచున్న వీనియొక్క లలాటచిహ్నమే నాకు వీని ధ్రువపరచు చున్నది. వీనినడకలు నుడులు నట్లే యున్నవి. డెందమా! సందియ మేల? నిశ్చయముగా నాతఁడే. ఔరా! చోరా! యీగుణవతినయన ములఁ బడి యమసదనమున కరుగక మనుదు ననుకొనియే తలఁ చితివే ? నీవేషభాష లీసర్వపరిశోధనసరోజాక్షి యొక్క సమ క్షమునఁ బనికివచ్చు ననుకొంటివే ! వినాశకాలే విపరీతబుద్ధి యనునానుడి నానుడి కాదు (నిలుచును)

అదృ—ఇ దేమి గుణవతీ ! ఈనాఁడు పరమసంతోషమున వింతవింత చలువవలువలు ధరించి జగన్మోహినివి నా విలసిలుచుఁ గులు కుచు నిలిచినావు ?

గుణ—దేవా ! నేఁ డీమహానుభావునిరాక నాకును నత్యానందము కొలుపఁ జిన్ననాఁట నెన్నఁడో నేర్చికొనిననాయాటపాట లొక్కింత కనఁబఱచి మిమ్మందఱ నానందనిమగ్నులఁ జేయ నెంచి వచ్చితిని. నాస్వాతంత్ర్యమును మన్నింపుఁడు.

అదృ—ఆహా ! మన్నన యేల గుణవతీ ! నీ వొనర్చునవన్నియు నా యానందమునకే కదా ! (మైరావణునిదిక్కు) స్వామీ ! తమ యభిప్రాయ మేమి ? ఆమెకోరిక తీరుతమే ?

మైరా—అటులే కానిమ్ము. ఓఆటవెలఁదీ! తేటగీతము నుపక్రమింపుము

గుణా—చిత్తము.

ఆ. వె. ఆటవెలఁది ! యేది తేటగీతమును ను
పక్రమింపు మంచుఁ బల్కినారు
తేటగీతమున స్మృతి ధృతిని బఱపుఁడు
నిర్వృతి ప్రీతిఫలముగ నెఱపుదాన.
స్వామీ ! సెలవా ?
అదృ—కానిమ్ము గుణవతీ !
గుణ—(నాట్య మొనర్చుచు.)

**(40)** అనుబంధము.

అందఱు—అత్యానంద మత్యానందము !
మైరా—ఏది మరియొకగీతిక ! ఆహా ! నాచేతముఁ దరలించితివి !
గుణ—(తనలో) నీచేతమును దరలించుటకే నేఁదరలి వచ్చితిని.

**(41)** అనుబంధము.

(అని నాట్య మొనర్చుచుఁ దొలుత మైరావణునియెదుటఁ గటారిని గుచ్చిపెట్ట మైరావణుఁ డులికిపడి తనకటారి తీసి వెదకుచును. తిరుగ నదియే పాడుచు అదృష్టవంతునకును గుణవంతునకును గుచ్చిపెట్టును)
మైరా—ఆహా ! యిది యభినయమా ! తొందరఁ జెందితి. హాయి ! హాయి ! యేదీ తిరుగ నభినయింపుము !
గుణ—మేలు ! మేలు !

**(42)** అనుబంధము.

మైరా—హా ! హా ! (అని విలవిల లాడుచుండును)
అదృ—(తటుక్కున లేచి కోపమున) ఆఁ ఆఁ ఏమి ! ఏమి !

**(43)** అనుబంధము.

గుణ—స్వామీ ! నామనవి నొక్కింత వినుఁడు
అదృ—ఛీ! ఛీ! యింకను బలుకు చున్నావే !
గుణ—ఆర్యా ! వానియొక్కస్వర మానవాలుకట్టరా ! వానినొక్క

యానన మాలోకింపరా ! వాఁడు నేను దొంగల నల్లరం గక తేర్చి నీవి భంగపఱప నీతఁడు పఱుగిడఁ బోయి పడినాఁ డవి వక్కాణింపనే ! ఆయుదుటిగుఱుతు నైనఁ గానకయే నను నోనాడఁ దగునే?

అదృ——ఏమి వాఁడే వీఁడే ?

గుణ——ఔను. మానియుమానని వానియూనవాంకమే యాకళంకుని నిజస్థితి వెల్లడించు. మరియు విరాగి కటారి యేల గుప్తపఱచె?

మైరా——హా ! మారీ ! మమ్మందఱ నీవే మన్నించితివే ! ఓయదృష్టవంతా !_నీవే నాకనకగహ్వరమున_కీఁక నధికారివి_మేమంద ఱము_ మడిసితిమి_సుగుణగణునిన్ను_వరించుట_నాపాన్నవాగె ములకై_నే నంతగా _ సంతాపింపను_గాని నా_దుష్టవర్తనకు _ పశ్చాత్తాప_మొందుదు_హా !_హా ! (కొట్టుకొని చచ్చును.)

అదృ——ఆహా ! (గుణవతిశిరము మూర్కొని) ఆహా ! గుణవతీ ! మెచ్చవచ్చు ! నలుబదిమందిబందికాండ్రను నిమూలమున నే మ్రింది రఁట. నాకులము నిలిపితివి. గోత్రము నిలిపిననీవే నాపుత్రునకుఁ గళత్రమవై విలసిలుదువు గాత ! రమ్మిటు రమ్ము భటులారా ! ఆశవము నావల కీడ్చి పూడ్చివేయుఁడు. గుణవంతా ! రమ్మిటు: బంగారమునకు హీరమును జతపరచినట్లు నీ కీగుణవతిని వివాహ మొనరింతును. సత్వరము గిరిదరి కరిగి పెన్నిధి మన్నిలయముఁ జేరుప వలయు. (వారిరువురఁ జేతులు పట్టించి) ఇఁక వలసినదేమి.

కం. సతులకుఁ దలకట్టువయితి
సతతము మాప్రాణములను సాఁకుటచే నా
సుతునకు జతపఱచిన నా
సుతరత్నమ వీవు కాని స్నుషరత్నమవే.

## మంగళమహాశ్రీ వృత్తము.

మంగళము విశ్వకర ! మంగళము విశ్వభర !
మంగళము విశ్వహర ! శౌరీ !
మంగళము మోదకర ! మంగళము పాపహర !
మంగళము శ్రీకర ! మురారీ !
మంగళము ధీనికర ! మంగళము చక్రధర !
మంగళము మేరుగిరిధరా !
మంగళము కంజకర ! మంగళము శాంతికర !
మంగళము మంగళమహాశ్రీ.

గద్యము—ఇది శ్రీమత్సహస్రసహస్రపత్రమిత్రప్రభాభాసమాన శ్రీరాము కరుణాకటాక్షవీక్షణాసాహాయ్యాలబ్ధకవితాధారేయ సుకవివిధేయ పైడిపాలగోత్రోద్భవ పామర్త్యన్వయాబ్ధి ప్రదీపాబ్ధినవనీత వీరస్వామ్యాఖ్యతనూభవ సింగాంబాగర్భశుక్తిముక్తాఫల బుచ్చిరాజప్రణీతంబైన శ్రీసంగీత అదృష్టవిజయ నాటకంబున

ష ష్ఠాం క ము :

సర్వము సమాప్తము.

శ్రీ రామార్పణమస్తు.



# అనుబంధములు.

## (1) అనుబంధము.

పూరికల్యాణిరాగము: రూపకతాళము.

ఓపరాత్పరా! దీనద - యాపరా! పరాకు లేక
నాపసిపాపల ననిశముఁ - గాపాడఁగ నీదే భార మో॥
ఓపిక నింకేపగిది నే - నాఁపఁ గల సీతాపతీ!
పాఁపదడిబ!- పాపదమథ!- నీపదములె - నెరనమ్మితి నో॥

---

## (2) అనుబంధము.

హిందూస్థానీ బేహాగ్ రాగము: రూపకతాళము.

కరుణాలవాల!- కాంచనచేల!- శ్రీలోల!
పరాభవంబునఁ - బరిపరివిధములఁ
బరితాపమును బొందఁ - బరికింప కుందువె॥
ఓ సర్వదృశ్యాదృశ్య చేతనాచేత నాంతర్బహిర్వ్యాపకా! ప్రాపకా!
ఆసించి నీకృపార - సాస్వాదనమునకు నై
దోసి లొగ్గితిమి - దోసముల్ తొలఁగఁ-
ద్రోసి ప్రోవవే - గాసి పెట్టకే - మానసఖుఁడా!॥

---

## (3) అనుబంధము.

బారువరాగము; ఆదితాళము.

ప్రకటముగ నీ రేడు - లోకముల నా - లోకమునఁ
జాకచక్య మేర్పడంగ - సాఁకుదేవా!
మాకు నీవ కావా? - కావవా? దేవ దేవా!

సుమ——త్యాగరాగముల నింకను - భోగభాగ్యములు లేకయు
అదృ——వేఁగు చున్న వారము మా - యోగమునకు
సుమ——వేఁడినకు - జాహ్న (అని లోనకు నరుగు చుండును.)
అదృ——మీఁడియే - పాడియే ? (అని అడవి తెన్నుఁ బట్టుచు)

(ఇరువురు మరల)

ప్రకటముగ నీ రేమ........సాఁకు దేవా ! (చనియెదరు)

---

## (4) అనుబంధము.

హిందూస్థానీ బేహాగ్ రాగము: ఆదితాళము.

భాగ్గెమో మా - భాగ్గెమో - మా - భాగ్గెమో అహా హా
లగ్గు లగ్గు నిగ్గునిగ్గునా నెములు - లబించు లబించు
యీరేయి యాచాయ॥

పొంచితి - పొంచితి - కాంచితి-కాంచితి- సంచరించుచు నహా !
సంచుల్ - సంచుల్ - కావు కాంచనమే - కాంచనమే
పంచపాలీ నుండి - మంచికన్న మెయ్యాలి॥
కన్నగాఁ డీఁడు - మంచి - కన్నగాఁ - డంచు - నన్ను
మన్నుమీఁ - దున్న పజ - లెన్ని నాసాంగ్యరంగ !
నన్ను గన్న - నాపేరు విన్న
గుండెల్ బాదుకొంచు - మొగముల్ మోదుకొంచు
దబదబా - దబదబా - గబగబా పాఱాలి॥

(చంకలు కొట్టుకొనుచు ముందు చూచి)

గుసగుసలు - రొసరొసలు - గుడగుడాలోసనలు
యీల్లేరో - యెట్టి మొగాల్లోరు ! (నవ్వి)
పస గలదో యీల్లొద్ద - పసిఁడి గలదో సూడాలి
సనువు సేయాలి - కూడా పడాలి - బడితిపూజ సేయాలి.

## (5) అనుబంధము.

వంగదేశీయముఖారిరాగము: ఏకతాళము.

ఎన్నటికి తీఱునో ! మా - బన్నము లిఁ కెన్నటికి తీరునో !
అన్నా ! ఆ - పన్నరక్షకుఁ - డన్నబిరుదును - గొన్న వెన్నుఁడె
కృపఁ గన - కున్న వాఁడు మా
పున్నె మిట్టు - లున్న దయ్యయో !॥
పరాత్పరుండు సమద - యాపరుండు
పాపరహితుండు - పాఁపడడి బై యుండు
తాప మాఁప సమర్థుండు పర - తాపైకధుర్యుండు
ఆపరమపురుషుఁ - డే పరికింపక మము
నాపదలను ముంచి యుంచఁగా
వేఱువార - లేరు లేరు - గారవింప॥

---

## (6) అనుబంధము.

హిందూస్థానీ బేహాగ్ రాగము: చాపుతాళము.

మేలు మే లయ్యారె ! - మేలు మే లయ్యారె !
చాల సంతోషము-చాల సంతోష మిా-వేళయనుకూలించెఁగా
అందఱకు - నందఱకు - నందఱ కహా !
కాళీ ! దయాలవాల ! వినుతశీల ! స్మితకపోల !
నీ కిదే జోహార్
జోహార్ - జోహార్ - జోహార్ - జోహార్॥
ఔర ! డెందము లా - నంద మొందె మేలి - కుందన మంను
కనువింపుగఁ - బొందుటచే
అందఱకు - నందఱకు - నందఱ కహా !

కోరిక లూరె బం - గారుసంమొ న - న్యారిగాఁ - జేరుపన్
అహో హో హో హో హో హా హా॥

---

## (7) అనుబంధము.

హిందూస్థానితోడిరాగము: ఆదితాళము.

ఏమీ నాప్రాణేశ్వరుఁ డింకను - నింటికి రాకయ తడయఁగ గారణమే॥
బాము లవేమైనను బొందవు కద - పాములతో నిండినయడవినడుమనే॥
ఎన్నఁడు నిటు చీఁకటిపడుదాఁకను - నున్నవాఁడు కాఁడే యిలు చేరక
అన్నా! నాదురదృష్టము పతి కే - బన్నములను సమకూర్చెనో హా! హా!॥
అకటా! నామూలమున నె తమ కీ - యనుపమకష్టములలవడు చుండెను
సకలగుణాకర! - సజ్జనశేఖర! - సర్వశుభంకర! - సాధువశంకర!॥

---

## (8) అనుబంధము.

బిలహరిరాగము: ఆటతాళము.

పురాకృతమా! - తరమే నిను - కెరలుప - నరులకు॥
అరుచి కావించితివే? - విరించికి మము నిరువురఁ
గరుణాకరుఁడౌ - హరికి మాపై నెపు
కరుణ కల్గెడినె - పరితాపంబును
బరు గిడఁ జేయునె - మురువు కూర్చుచున్
వరము లొసంగుచు - సిరులను బెంచునో
మెఱుఁగ కుంటి - మఱవ కుంటి-
తొఱఁగ కుంటి - వెరవృపాంబు॥

---

## (9) అనుబంధము.

హిందూస్థానీఫీల్వారాగము: రూపకతాళము.

నను ప్రోవఁగా వాదా శ్రీదా యేదారియు లేదు॥

తనసమందు ని - న్ననయంబుఁ గొంకఁ
గనుపింప వెందు - కనుకంప నొందు॥

---

## (10) అనుబంధము.

"మేలు మేలయ్యారె" యనుపాట. (చూ. (6) అనుబంధము)

---

## (11) అనుబంధము.

హిందూస్థానీ బేహాగ్ రాగము: ఏకతాళము.

పైరా—పొందు పొందు వెదకఁ బొం డీగంటుకొండలన్
దండిగా నున్న పొదల - మెండుగను నిండిన
చెట్టులఁ బుట్టలపట్టులన్
త్వరఁ - బొండీ పోవండి - చెం డాడునటులు వెదకండీ
ఆ - గండరగండఁడు - కనంబడినచోఁ-గడురయమునఁ గొనిరండీ
మొండితన మూడఁ దగు - దండనమున మట్టుపెట్టఁగ
దండిగను నున్న పొదల - మెండుగను నిండిన
చెట్టులఁ బుట్టలపట్టులన్॥

---

## (12) అనుబంధము.

"మేలు మేలయ్యారె" యనునది (చూ. 6 వ అనుబంధము)

---

## (13) అనుబంధము.

సింధుకామాఞ్చీ రాగము: రూపకతాళము.

కాలమ ః - వీలోనసే - యీలీల మాఱితివె ఆహా!॥
అసమానమున - ననయమునున్
మనలెడునరపశువులతోన్ - బొనఁగి యుంటివే॥

వేసగాండ్రతోడ మరియు - మోసగాండ్రతోడ నీకను
దోసగాండ్రతోడ నిండి - వాసి మీఱు చుండుదె
జి - జ్ఞాన పీఠకే॥

## (14) అనుబంధము.

కల్యాణిరాగము: ఆదితాళము.

మేశా! రమేశా! పరమేశా! ధరణీశా!॥
కరుణాకరు నిన్ - బరిపరి నెడ నెడ
స్మరియించెద నీక - వరము లొసంగవె॥

---

## (15) అనుబంధము.

హిందూస్థానీ బేహాగ్ రాగము: ఏకతాళము.

పెంకెతనంబున - గొంకక గుహ నిరా
టంకముతోడుతఁ జొచ్చియు దా
బింకముఁ జూపఁగ - ఆ కెను వేసిన
పంకిలచిత్తుని నెన్నఁడు నిట్టులె॥

ఆట తాళము

శంక తొలంగుచుఁ - బొంక మడంచుచు
లెంకలార! మనుఁ - డింకమీఁదనున్॥

---

## (16) అనుబంధము.

"మేలు మేలయ్యారె" యనునది. (చూ. (6) అనుబంధము)

---

## (17) అనుబంధము.

హిందూస్థానీయ ఖాఁ రాగము: ఆదితాళము.

హా! నాయన్నా! - హా! నాయన్నా!

మానసికష్టముల - నూని చేష్ట లుడుగ కుండ
హా! నాసష్టవిధీ! - హా! నానొష్ట విధించితె॥

## (18) అనుబంధము.

బారువరాగము: ఆదితాళము.

నావరాగ్రిజుఁడు దిక్కటి - యీవిధముగ నిధన మొందె
దైవమా! హా! నుదుటివ్రాఁత - తప్పింపఁగ నెవరితరము॥
ఎవరి కెదియొ-యెపు డెదియొ-యెం దెదియొ-యెవ రెఱుఁగుదు
రవిరళభక్తిని నిన్నను - నానందము నొంది యున్న
నాయన్న - అన్నా! - మన్నిగొనఁ బడియెఁ - గ్రిన్నన॥
కలుకుకత్తు లొక్కమొగిని - నలుకులు పెట్టుచు నుండఁగ
అల పిడెనో - కఁరా! - పరు గిడెనో - అసూ!
మొల లిడెనో - వనిం - జెరలాడెను॥

## (19) అనుబంధము.

బారువారాగము: రూపకతాళము.

ఎంతసంతాపము! - నా - కెంతపరితాపము!
కాంతాగ్రిజవియోగము - నా - కావించినపాపము॥
ఈదురంతసంతాపము-నా-యంతముఁ జూడఁగ నార్పునాదీపము
చింతను మునిఁగి నా-చేయున దేమి నా-జీవముఁ బాయుటవినా
నాతనుత్రాణము! - నా మన్నించుప్రాణము!
భ్రాంతి భ్రాంతి శుమ్మ-భ్రాంతి భ్రాంతి కన
రాఁడు రాఁ డిఁక సీఘాత్రిని॥

## (20) అనుబంధము.

హిందూస్థానీముఖారి రాగము: ఆదితాళము

హా ! దురదృష్టవంత ! - హా ! దయాస్వాంత !
మేదురకీర్తికాంత ! - సాదరబుద్ధిమంత !॥
కట్టా ! విరించి యెంత - కట్టిఁడిరా నీ
కెట్టిదుర్మరణముఁ - బెట్టె నింతలోన॥
నీదురాశ యె ని - న్నీదుఃఖవస్థకుఁ
దాఁ దరలించెను - వేదన ముంచెను॥

---

## (21) అనుబంధము.

హిందూస్థానీతోడిరాగము: ఆదితాళము.

హా! ధాత నాదుట వ్రాసి యుండఁగాఁ దల్లడిల్ల నేల
పాతకురాలను - భూతలమున నే - మాతాపితలను - వే తరలించుట॥
అయ్యో ! జెందము - వ్రియ్య - నెందుకు - డయ్యా మందుల కియ్య
వెయ్యాలులు - కు య్యడినఁ బూర్వభవ
మయ్యో ! వ్రియ్య దింత కట్టి కుడుపక
వనటను - మాపఁగిన - జనకుఁడు - మను నెకో !
కలఁగి - వలగి - తొలఁగ - వలయు - నసువులు॥
ఈదురదృష్టవంతుఁ - డింతెటనె గతించుటయుఁ
నాదురదృష్టమే - కర్మానుభవమే
మేదిని నా కింక నెన్నిపాట్లున్నవియో
గొంతుకు రాల్పడ - నెంత చింతించిన - నేమిప్రయోజనము॥

## (22) అనుబంధము.

హిందూస్థానీభైరవిరాగము: ఏకతాళము.

అరరరె! యేమి దే మిదీ? - కర మరు దారు చుండెఁగా
చెరచెర పోయి పోయి మీ - రరయుఁడు వేరు వేర్వుగా॥
ఝరులను- గిరులఁ- దరువులన్-బొరియల - దరులం వెరువులన్-
ద్వారఁ ద్వార సాగి సాగి వే - మరలుఁడు - మరలుఁ దుద్ధతిన్॥

## (23) అనుబంధము.

హిందూస్థాని బేహాగ్ రాగము: ఏకతాళము.

మారీ—ఔర! తాఉమా అగు చూడె మనయదృష్టము
చోరులార! కష్టము - భూరి సారనష్టము॥
చోరు—ఏల యీలీలఁ జాల - బేలు పడఁగఁ గడు
డీలుపడఁగ గ - గ్గోలుఁ గొనఁగ మాదొరా!
మారీ—ఏది మర్త్యులకుఁ జొరఁగ నలభ్యము
ఏది నిర్గమింప నలవి కానిదుర్గము
అంచుఁ దలఁచి - యించుక సంకోచింపక
సంచరించు చుంటిమో
ఆకాంచనమయాగారము - ఇఁక మనది
కా దనిపించు చూడె నామనము
చోరు—అయ్యయ్యో! గుండెలు - వ్రయ్యఁగఁ బల్కె దే
మయ్యా! నేఁ డీరీతిగా

## (24) అనుబంధము.

హిందూస్థానీభైరవిరాగము: ఆదితాళము.

మారీ—ఓరో రెల్తుండ - ఓరో రెల్తుండ - ఓకో రెల్తుండ
నారయుండా! యీ - సారి నా - సార మెల్తుండా॥

మంచియేస మేసుకొని - చంచలపాలయి యీలుగ
సంచరించి - పొంచి పొంచి - కాంచి వానిఁ-ద్రుంచివేతు॥ నె॥
ఆహా! సోకు చూచి - యింక నా - నాకు చూచి
వెల్లే వీక చూచి - మల్లీ - రాక చూచి
మీకే - చీకాకు - రాకుండ - లేకుండ కాక నాపై నెట్టుదా॥

---

## (25 అనుబంధము.)

హిందూస్థానీసావేరిరాగము: రూపకతాళము.

అకటా! ఓ విధీ!

నన్ను మిన్నునకెక్కించి - మన్నునకుఁ ద్రొక్కితె॥
అదృశ్యుఁ - డయ్యెనే - యన్నయు నాచరితము - అతిదుఃఖ
సాదృశ్య మయ్యెనే అయ్యయో
నన్ను మిన్నునకెక్కించి మన్నునకుఁ ద్రొక్కితె॥
వినతి యొనర్తు నా - మనవిని విను వినా ధాతా!
నను సమయింపుము
నానిజసోదరు - తోనను కలుపుము
దీనుఁగ గాపాడవే వే॥

---

## (26) అనుబంధము.

హిందూస్థానీతోడిరాగము: ఆదితాళము.

గుణ - హా! సదనమా! ఆస వదలనా?
నీసహాయమునను - నీకుఁ బొందలన ॥హా॥
జ్ఞానము వచ్చిననాఁట నుండి నీ
లోనన మసలుటచే నిను వీడఁగ
నెవిధి నొప్పుదు - నెటు ప్రేమ రొప్పుదు

పోవక తప్పదు - నావగఁ గప్పను ॥హా॥

అదృ—ఏల ? బేలా ! - యిటు లిడ గోల
కాలమానమును - గనుఁగొను బాల ! ॥ఏల॥
వేయేఁడులు మన - మేకముగను హా !
యేడిచి ఫలితము - నింతయుఁ బొందను
ఏది స్థిరమ్మో - కా దిఁక రమ్మొ
ఆదివిధ మ్మో - మాదిరి వమ్మొ ॥ఏల॥

---

## (27) అనుబంధము.

"మేలు మేలయ్యారె" యనునది (చూ. (6) అనుబంధము.)

---

## (28) అనుబంధము.

"మేలు మేలయ్యారె" యనునది (చూ. (6) అనుబంధము.)

---

## (29) అనుబంధము.

(జాగ్లా) వంగదేశీయతోడి రాగము: ఆదితాళము.

ఎంతయు - వింత గూా - నింతయుఁ - జంత సేయ ॥ నెంత॥
పంతముతోడ నీ - శాంతస్వభావు నెవ్వరో
అంత మొనర్ప న - త్యాంతమున్ - బొంచినా ॥ రెంత॥
తెలిగుర్తుల నింతకు మును పేనీ
తలుపులపైఁ గని యనుమానంబునఁ
దలఁచి వీధిలోఁ - గలగృహాకవాట
ములపై నట్టులె పెట్టి వచ్చితిని ॥-॥
ఇది యెవరిరోసమో - మోసమో
యేటికో క - వాటములపై

వాటముగ నిటు - వ్రాసి పోవఁగ॥-॥
చోరులో - జారులో - యేగో - యీరీ
తిని గనుమఱఁగియ సంచరించెదగు
మాఱుతురే పరి - మాఱుతురే - మఱి
యేము సంచరించెదమూ బిఱబిఱ ॥-॥

---

## (30) అనుబంధము.

జంజూటిరాగము: అదితాళము.

ఈనాఁటికీ - నాటింది బా బీనాటికీ నాటింది బా
బీనాలిముచ్చాడోళ్ళ మా యీనాటికీ॥
కన్నెపిల్లల నంమున - అన్నన్న బొత్తిగ నమ్మఁగూడను
వన్నెచిన్నెల - నెన్నో చేసి - కన్నులను గొట్టుకురు మన్నీ॥
అల్ల కున్నమాయమర్మం - జెల్లకు నుండను బాబయ్యా !
వల్లకానోల్లు బాబయూ! మా - నల్లకానోల్లు బాబయూ !
పైకి - పిల్లుల్లా గుంటారయో! - పులి - పిల్లలే
పులి - పిల్లలే! - ఆల్లు వల్లమాలినపనోల్లు బా బీ॥
అరుగ వలసినతావులకు - అరిగి యరిగి - మరగి మరగి
జరుప వలసినపనులనెల్ల - జరిపి జరిపి - సురిఁగి సురిఁగి
మఱుఁగుపడి-మఱుఁగుపడి-యే-మెఱుఁగనటు లుంటారు బాబీ॥
నాకొంప తీసింది నాయ్నా! - మాకానిపని చేసిం దయ్యో!
ఆకన్నెపున్నెన్న తండ్రీ! - నాకంట మెల్లా వృందం డీ॥

---

## (31) అనుబంధము.

హిందూస్థానీ ముఖారిరాగము: ఆదితాళము.

అకటకటా! మన కీ కలుములు నిలువవు సుం డింక॥

సకలమును - వికల మగుచెడుకాలము సంభవించె. నయకూ
ప్రకటిత మగు మన - ప్రాణములమీఁ
దకే రాఁ దెగించి సంచరించు నెవఁడో యంచు॥

---

## (32) అనుబంధము.

"మేలు మేలయ్యారె" యనునది (చూ. (6) అనుబంధము.)

---

## (33) అనుబంధము.

హిందూస్థానీ తోడిరాగము; ఆదితాళము.

గుణ—స్వామీ! నను పిలిచినకారణ - మేమి వాకుప్రివ్వంగదే॥
ఏమాయలలో నైనను - నేబాములలో నైనను
వేమాఱుఁ జిక్కుకొనున ట్లీమాఱును బడి యుంటిమి॥
కనులు మూసి - గంతలు కట్ట నున్న
ఘనమాయలకును లోఁబడి యుంటిమి
మనయదృష్టమున - మను చుంటిమి యీ
వనజభవుం డీఁ-కను నేమి వ్రాసెనొ॥

---

## (34) అనుబంధము.

కాంభోజ రాగము; రూపక తాళము.

ఎంతమాయమైఁ - జెంతఁ జేరి తో
పంతగొండికాఁడ! - నేఁడు॥
వింత తైలవ ర్తకుఁడ వయి
యింత యైన ననుమానంబు లే కుండఁగ॥
నూనెతో నింపిన - నానివిధంబున
హీని నన్నింటిని - నీని శాచరుల

శ్రీ

శుభమస్తు.

# సంగీత వీరసేన విజయము.



నవరసభరిత శృంగారరస ప్రధానంబగు

నాలుగంకముల నాటకము.

ఇయ్యది

మ॥రా॥శ్రీ॥ రాచర్ల వెంకట కృష్ణారావు పంతులుగారిచే

రచియింపబడి



బ్ర॥శ్రీ వేతపూడి లక్ష్మీకాంతశాస్త్రిగారిచే పరిష్కృతంబై,

[illegible] రావు నాయనిచే ప్రకటింపబడియె

మొదటికూర్పు 1,000 ప్రతులు.

మచిలీపట్నం.

శ్రీమహేశ్వర ముద్రాక్షరశాలయందు ముద్రితము.

1915.

 దీనివెల రు. 0_8_0.